# ఒ క మా ట

చిమ్మచీకటి చీల్చుకుని వెలుగుబాటలోకి వస్తున్న అంతటి మహా ఖండాన్ని గూర్చి 'ఇంత' క్లుప్తంగా చెప్పుకోవడం ఎవరికైనా కష్టమే. అయినా. ఆయా దేశాలకు చెందిన ముఖ్య విషయాలు పాఠకుల దృష్టినుండి తప్పిపోకుండా, ఒక్కసారి చదివితే మొత్తం ఆకృతి, నెమరువేసుకోగానే కళ్లకుకట్టినట్లు అవుపించాలి. పైగా ధర అందుబాటులో వుండాలి. అందుకే యీ చిన్న ప్రయత్నం. ఒకవిధంగా యీ ఆఫ్రికా చరిత్రను, చరిత్రకంటే 'డైరీ' అంటే బావుంటుంది.

ఈ చిన్నపొత్తం వ్రాయడంలో నాకు ఈ క్రింది పుస్తకాలు తోడైనాయి: జాన్ గంధర్ వ్రాసిన "ఇన్‌సైడ్ ఆఫ్రికా". "ఆఫ్రికా, ఎ ఫోవిక్స్ రీవారన్"; శ్రీ అయ్యదేవరవారి "ఈజిప్ట్ చరిత్ర"; "గోల్డెన్ బుక్ ఎన్‌సైక్లోపిడియా"; "న్యూసైమ్స్" వ్యాసాలు"; "హిందూ"; "లింక్" పత్రికా వ్యాసాలు. ఆయా గ్రంథకర్తలకూ, రచయితలకూ నా కృతజ్ఞత.

విజయవాడ.<br>
12-10-'60.

—ర చ యి త.

# ఆఫ్రికా

"ఆసియా, తూర్పు అరబ్ దేశాలు చూపిన పరమ పథంలో అడుగుపెట్టిన ఒకనాటి చీకటి ఖండం (ఆఫ్రికా) నేడు శతాబ్దాల తన దాస్యబంధనాలను తెగతెంచుకొంటోంది. దాస్య బంధన విముక్తికై సాగే ఈ మహోద్యమపు సుడిగుండంలోనే నవనాగరికతా పునాదులు లేచి, జనావళికి శుభం చేకూరుతుందనడంలో సందేహంలేదు. ఈ నమ్మకం, రోజురోజుకీ మన కవుపిస్తున్న నిత్యనూతన సత్యాలవల్ల మరింత ధృవపడుతోంది కూడా. ఈ నవ సంస్కృతీవెల్లువ అనూచానంగావస్తున్న ఆఫ్రికాజాతి మహోత్కృష్టమైన నాగరికతను, సత్సాంప్రదాయాలను ఏకోన్ముఖంచేసి, నేటి విశ్వజనీన సంస్కృతీ మహార్ణవంలో అంతర్భాగ మొనర్చి తీరుతుంది."

[ జీన్ సరెత్ - కనాలే, ప్రఖ్యాత ఫ్రెంచి చరిత్రకారుడు ]

ఇది వాస్తవం. "చీకటి ఖండం" అని పేరుబడసిన ఒకనాటి ఆఫ్రికా నేడు సచేతనమైంది. ఆఫ్రికా ఖండంలో రోజుకో తీరున త్వరత్వరగా మార్పులు వస్తున్నాయి. శతాబ్దాల నిద్రాణ స్థితినుండి జాగృతమైంది ఆఫ్రికా.

భౌగోళిక విషయాలు: ప్రపంచంలోని ఏడు ఖండాలలో, ఆఫ్రికా రెండో పెద్దఖండం. మొదటిది ఆసియా.

ఆసియా, యూరప్ ఖండాలు రెండూ ఆఫ్రికాకు చాలదగ్గరగా వుండే ఇరుగు పొరుగు ఖండాలు. ఒకచోట జిబ్రాల్టర్ జలసంధి లోని తొమ్మిది మైళ్లమాత్రమే ప్రవహించేఒకనీటిజాలు ఆఫ్రికా, యూరప్ ఖండాలను వేరు చేస్తోంది. ఆఫ్రికా, ఆసియాలను సూయజ్ ఈస్తమస్ కలుపుతోంది. ఆఫ్రికా ఖండంలో పెద్దపెద్ద ద్వీపకల్పాలేవీ లేవు; పెద్ద పెద్ద అఖాతాలూ లేవు. ఈ ఖండపు తీరప్రాంతమునూ్నా బహుసున్నితమైనది. ఈదృష్ట్యా చూస్తే, ఆఫ్రికాఖండం ఆసియా, యూరప్ ఖండాలతో భేదిస్తోంది. అందుకనే ఆఫ్రికా పటాన్ని గీయడం చాల తేలిక. ఈ ఖండంలో ఏడాదిలో ఎక్కువ భాగం వేసవికాలంగానే వుంటుంది. భూమధ్యరేఖకు సమీపంలో వున్న దట్టమైన కీకారణ్యాలలో మాత్రం దాదాపు ప్రతిరోజూ వర్షం పడు తుంది. కాని యింకా ఉత్తరంగా పోయినా, ఇంకా దక్షిణంగా పోయినకొద్దీ ఇసుక ఎడారులమయమైన విశాల ప్రాంతంలో దాదాపు అసలు వర్షమే కురవదు.

ఆఫ్రికాఖండం "చీకటి ప్రాంతం" అని పిలవబడ్డానికి కారణం ఆ ఖండంలో విశాలప్రాంతాన్నిగూర్చి బయట ప్రపం చానికి ఎక్కువగా తెలియకపోవడమే. ఇతర ఖండాలవారు ఆఫ్రికాలోని అత్యధిక భాగాల నెన్నడూ కనుగొని వుండకపోవ డమే ఇందుకు కారణం. 1. ఆఫ్రికాప్రాంతంలో పర్యటన బహు కష్టసాధ్యమైన దవడంవల్ల; 2. కొన్ని ఖండాలలో సాధ్యమైనట్లు లోతైన అఖాతాలగుండా సముద్రపునావలు ఆఫ్రికా లోపలి భాగాలలోకి చొచ్చుకు వెళ్ళలేకపోవడంవల్ల కూడా ఇది సాధ్యం కాలేదు.

పోతే ఆఫ్రికాఖండంలోని రెండు పెద్ద ఎడారులలో ఒకటైన సహారా ఎడారి ఖండంలో ఉత్తరంగానున్న సగ భాగాన్ని తాకుతూ పోతుంది. సహారాకు దక్షిణంగా నివసించే వారు నల్లజాతివారు (నీగ్రోలు). సహారా దక్షిణ ప్రాంతాలను పరిశోధించే పేరుతో వచ్చిన తెల్లవాళ్ళను స్థానికప్రజలు ప్రతిఘటించిన రోజులున్నాయి. ఈ ప్రతిఘటన, బయటవారి జోక్యం ఎక్కువైనకొద్దీ, మరింత ఉధృతరూపం ధరించింది. ఈ తెల్లవాళ్ళు లేదా శ్వేతజాతీయులు ఈ ప్రాంతాలవారిని ప్రపంచంలోని తదితర ప్రాంతాలవారికి బానిసలుగా అమ్మజూపినప్పుడూ ఈ ప్రతిఘటన ఎక్కువైంది.

మధ్య ఆఫ్రికా ప్రాంతాలు అంతత్వరగా కనిపెట్టబడకపోవడానికి మరో కారణం వుంది. తీరప్రాంతంనుండి తెల్లవ్యాపారులకు దంతాలు, బంగారం, బానిసలను తెచ్చుకోవడం సాధ్యపడలేదు. ఈ మహా ఖండభూగర్భంలో నిక్షిప్తమైయున్న ఇతరత్రా సంపద వారికి అంతు చిక్కలేదు.

## 1870 తరువాత........

కాని 1870 సంవత్సరంనాటికి కొద్దిమంది పరిశోధకులు మాత్రం ఆఫ్రికా ఖండపు లోపలిప్రాంతాలకు వెళ్ళి, అక్కడున్న సంపదను వెలికితీయ ప్రారంభించారు. దానితో వ్యాపార దృక్పథమూ ఎక్కువైంది. అదే సమయంలో యూరప్ దేశాలు జనసంకీర్ణమవుతున్నవన్న మిషజూపి, పెరుగుతున్న జనాభాకు భూమీ, పుట్రా చూపేందుకని ఇతర దేశాల భూభాగాలపై బడ్డారు. దీని ఫలితమే

ఆఫ్రికాలో వలసలు నెలకొల్పుకోనేందుకై యూరప్ దేశాల మధ్య కుమ్ములాటలు ప్రారంభమవడం.

ఈ విధంగా 19వ శతాబ్దం ప్రారంభదినాలలో యూరోపియన్ రాజ్యాలు తీరప్రాంతాలలోని మంచి అనువైన కేంద్రాలను పట్టుకుని, ఆఫ్రికాలో కొన్ని పరిమిత ప్రాంతాలలో మాత్రమే స్థిరపడగలిగారు. కాని కాలక్రమేణా సామ్రాజ్య వాదయుగం ప్రారంభంకావడంతో సంపదవంతమైన ఆఫ్రికా భూములలోనికి వలసవిధానం త్వరత్వరగా ప్రవేశించింది. ప్రథమప్రపంచయుద్ధంనాటికి ఆఫ్రికా అంతా సామ్రాజ్యవాదుల మధ్య దాదాపు పూర్తిగా విభజించబడిపోయింది. ప్రథమ, ద్వితీయ ప్రపంచయుద్ధాల మధ్యకాలంలో ఆఫ్రికాఖండమంతా జాగృతం కాజొచ్చింది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం జాతీయ చైతన్యం మూడు పూవులూ, ఆరుకాయలుగా పరిఢవిల్లజొచ్చింది. ఒకదానివెంటనే మరొకటిగా అస్వతంత్ర పరాధీన ఆఫ్రికాదేశాలు స్వాతంత్ర్యపథంవైపు సాగిపోనారంభించాయి.

*　　　*　　　*

## ఆఫ్రికాజాతి నాగరికత

ఈనాడు కోట్లాది ఆఫ్రికన్లు స్వాతంత్ర్యం సాధించుకోవడంవల్ల గతంలో విదేశీ ఆక్రమణదారులచే నిర్లక్ష్యం చేయబడి లేదా అణచివుంచబడ్డ గతచరిత్రను, నాగరికతను గూర్చి ఒక అంచనాకు రావడం సాధ్యపడుతోంది.

"చీకటి ఖండం" అంటే అర్థం, ఆఫ్రికా అంతటిని గూర్చి యిటీవలి కాలంవరకూ యెవరికీ యేమీ తెలియదని కాదు. యూరప్‌లోని ప్రజలు యింకా గుహాలలోనే జీవిస్తున్న రోజుల్లో, ఆఫ్రికా భూభాగంలోని నైలునదీ తీరాలలో నివసించిన ప్రజలు అత్యున్నతమైన నాగరికత గలవారుగా వుండేవారు. వారు అత్యద్భుతమైన కట్టడాలు కట్టారు. మహోన్నతమైన కళాఖండాలను సృష్టించారు. మెట్టభూములకు నీరందించేందుకై విస్తారమైన ఇర్రిగేషన్ పద్ధతులను అవలంబించారు. వారికి స్వంత లిపి వుంది. వారు ఈజిప్షియన్లు. కాని వారి నాగరికత మాత్రం ఆఫ్రికాలోని మిగతా ప్రాంతాలన్నింటికీ వ్యాప్తి చెందలేదు. మీదుమిక్కిలి అది మధ్యధరా సముద్రం చుట్టునున్న ప్రాంతాలకు, ఆసియా, యూరప్ దేశాలకు విస్తరించింది.

ఈ విధంగా మన శకానికి ముందు మూడు వేల సంవత్సరాల నాడే సమీపప్రాచ్యం, మధ్యధరా సముద్ర ప్రాంతాలతో పోల్చిచూస్తే, ఆఫ్రికా నాగరికత చాల అభివృద్ధి చెందినదని చెప్పవచ్చు. ముఖ్యంగా ఈ నాగరికత "నాపతే", "మీరో" లలోని "క్రొచిత్రా" నాగరికతకు సంబంధించినది.

అటు మధ్యాఫ్రికాలోని "పిగ్మీలు", కల్హారీ ఎడారిలోని "బోషిమాలు", "హాటెన్‌టోలు" ఆయా ప్రాంతాల శీతోష్ణ స్థితిగతులకు తగ్గట్లు నూతన జీవన విధానాలను రూపొందించారు. ఆయుధాలు తయారుచేసేందుకు, పురాతన పనిముట్లను తయారుచేసేందుకు రాగిని కరగించడం అనేది వారికి బాగా కొట్టిన పిండి.

క్రీస్తుశకం ప్రారంభదినాలలో ఆఫ్రికా ఖండపు దక్షిణ భాగంలో ఇనుమును గనులనుండి త్రవ్వి తీసేవారు. దానిని కరగించి, మూసపోసేవారు. ఇది ఆనాటికే వారి కెరుక! భాషాశాస్త్రం, ప్రాచ్యసాంప్రదాయ చరిత్రాధ్యయనం, పురావస్తు పరిశోధనా శాస్త్రం, చరిత్రాధ్యయనం ఈ శాఖలన్నీ ఇప్పుడు అందుబాటులోకి వచ్చిన తరువాత, అనంత పరిశోధన జరిగిన పిమ్మట, ఆఫ్రికాఖండంలోని అపారసంపద బయల్పడుతోంది. ఇందుకు కొన్ని ఉదాహరణలు చూపవచ్చు: ఇంతవరకూ గోవా, లిస్బన్, వాటికన్ లైబ్రరీల నుండి సేకరించినవీ, ప్రచురితంకానివీ మొత్తం 1500 పత్రాలు లభించాయి. ఇవన్నీ భాష్యం చెప్పుకోడానికి చాల అందుబాటులో వున్నాయి!

ఆఫ్రికా తూర్పుకోస్తాలో తగినంతగా చైనా పింగాణీ 1955 లో బయల్పడింది. ప్రాచీనకాలంలో గొప్ప వాణిజ్య కేంద్రాలు ఈ ప్రాంతంలో వుండివుండేవన్న నమ్మకాన్ని ఈ పరిశోధనవల్ల ధృవపడింది. సోమాలీలాండ్‌నుండి మొజాంబిక్ వరకూ వ్యాపించివున్న వర్తక శిఖామణులు హిందూ మహాసముద్రంవరకూ జయపతాక నెత్తారు! అరేబియాతోనూ, చివరకు ఆసియా దూరస్థ ప్రాంతాలతోనూ వారు వాణిజ్య సంబంధాలేర్పరచుకున్నారు. వాణిజ్య కేంద్రాలలో ఒకటైన నాటి "కిల్వా" (ఈనాడిది టాంగన్యీకా పేరుతో వ్యవహరింపబడుతోంది) భూభాగం 1½ మైళ్ళ పొడవున, వెయ్యిగజాలకు పైచిలుకు వెడల్పున వ్యాపించి వుండేది. ఈ ప్రాంతపు (కిల్వా) శిధిలాలన్నీ ఈనాడు కనుగొనబడ్డాయి. ఈ రకమైన మధ్యయుగాలనాటి స్థలాల జాబితా ప్రత్యేకంగా తయారు చేయ

బడింది. ఇటీవలనే, మధ్యయుగాలకు చెందిన, ఇప్పుడు కెన్యా దేశంలోని "మాలిందీ" రేవుకు సమీపంలోనే "జెదీ" అనే పట్టణ శిథిలాలను త్రవ్వి తీశారు.

మధ్యయుగాలలో ఘనా దేశ రాజధానిగా వున్న "కాంబీ-సాలె" అనే పురాతన పట్టణాన్ని భూగర్భంనుండి త్రవ్వి పైకి తీశారు. లింపోపొకు పై భాగంలో దక్షిణ రొడీషియాలోని ఒక ప్రాంతలో, ఒకానొక బలమైన ఆఫ్రికా దేశపు పురాతన రాజధానియైన "గ్రేట్ జింబాబూ" పట్టణ శిథిలాలు దొరికాయి. ఈ శిథిలాలను అతి జాగ్రత్తగా భద్రపరిచారు. కాని అద్భుతమైన కళాఖండాలను మాత్రం యూరోపియన్ సాహసికులు లూటీ చేశారు. అపురూపమైన లోహాలను కడ్డీలుగా మూసపోసి దొంగిలించుకు పోయారు. జింబాబో నగర నిర్మాణ ప్రాచీన నాగరికతకు ఈ అపురూప లోహాలు తిరుగులేని సాక్షి పేటి. కాని ఈ నగరకుడ్యాల వెనుక యింకా కొన్ని అపురూపమైన నిక్షిప్తాలున్నాయి ఇవి 12 అడుగుల యెత్తున వున్నాయి. ఏగు పొరలున్నాయి. వీటినిప్పుడు పురాతత్వ శాస్త్రజ్ఞులు త్రవ్వి తీస్తున్నారు.

ప్రాచీన రాగి, బంగారం, తగరం, ఇనుప ఖనిజాల గనులను త్రవ్వి తీయగా, నగర ఉనికికి సంబంధించిన పుట్టుపూర్వోత్తరాలను గూర్చిన లోహ నాగరికతపై సరికొత్త విషయాలు బయల్పడ్డాయి.

ఆఫ్రికా ఖండపు గత చరిత్రకు సంబంధించిన యీ స్థూలమైన పరిశీలనలో "జీన్ లియోన్" అనే వ్యక్తిని విస్మరించలేము. ఈయన ఎల్ హాస్సాన్ ఇబిన్ మహ్మద్ ఎల్

వజ్జాన్ అన్న పేరుతో చాలమందికి తెలిసిన ఆఫ్రికన్ దేశీయుడు. ఇతను 1490 ఆ ప్రాంతంలో "గ్రనాడా"లో పుట్టాడు. "గోవన్" సామ్రాజ్యానికి ఒకనాడు రాజధానిగా వున్న "టాంబోటూ"ను వర్ణిస్తూ జీన్ లియోన్ యిలా వ్రాశాడు: "టాంబోటూలో అనేకమంది న్యాయమూర్తులూ, వైద్యులూ, పురోహితులూ వున్నారు. వారిని రాజు నియమించేవాడు. శాస్త్రవేత్తలను సహితం రాజు గౌరవించి, ఆదరించేవాడు. బార్బారానుండి దిగుమతిఅయే అనేక లిఖితగ్రంథాలను అమ్ముతూండేవారు. అన్నింటికన్నా పుస్తకవ్యాపారమే బాగా లాభాలు తెచ్చిపెడుతుంది."

స్థానికంగా లభించిన తైనాతీల అండతో యూరపియన్ బానిస వ్యాపారులు ఆఫ్రికన్ల మూల్గులను పీల్చివేశారు. ఇదే ఆఫ్రికాజాతి నవనాడుల్నీ బంధించి, దాని బడుగుస్థితికి కారణమైంది "చీకటి ఖండానికి" తెల్లవాడు చేరింది ఆఫ్రికాను కనుగొనడానికి కాదు. భారతదేశానికి, ప్రాచ్యదేశాలకు ఎలా చొచ్చుకుపోవాలో మార్గాన్ని అన్వేషించేందుకే వచ్చాడు. ఈ తెల్లవాళ్ళు "నల్లదంతం" పేరుతో సాగించిన బానిస వ్యాపారం మానవ చరిత్రలోనే ఘోరాతిఘోరం. ఈ బానిస వ్యాపారఫలితాన్ని ప్రఖ్యాత ఆఫ్రికా చరిత్రకారుడు, నీగ్రో నాయకులలో ఒకరైన డాక్టర్ డూబోయ్ యిలా వర్ణించారు:

"బానిస వ్యాపారం ఆఫ్రికా ఖండమంతటా కొనసాగింది. ఇది శతాబ్దాలుగా సాగింది. ఈ రకమైన ఆర్థిక,

సాంఘిక, రాజకీయ ఘోరవిపత్తుకు మానవ చరిత్రలో మరో కటిసాటిరాదు.

"ఈ వ్యాపారం ఫలితంగా అమెరికాకు బానిసలుగా గొనిపోబడ్డ దాదాపు 2 కోట్లమంది ఆఫ్రికన్లతో పాటు, ఆఫ్రికాలో ఈ వ్యాపారంవల్ల మరో 50 లక్షలమందికి పైగా నిహతులైనారు. ఈ విధంగా కోట్లాది ఆఫ్రికా జీవాలు బానిస వ్యాపార బలిపీఠానికి ఆహుతైనాయి."

మానవేతిహాసంలో ఈ రకమైన దారుణ దమన నీతిని ఒకప్పుడు వలసాధిపతులూ, సామ్రాజ్యవాదులూ తమ కనుకూలమైన మాటల్లో చిత్రించి చూపడం కద్దు. కాని వలసపాలకులు చెప్పుకుంటున్న విజయాలన్నీ, పైశాచిక కృత్యాలవల్ల, కిరాతక పరిస్థితులలో సాధించినవేనని మనకు చరిత్ర చెపుతోంది.

ఇందుకు "సికాసో" అనే ఆఫ్రికన్ పట్టణాన్ని పట్టుకున్నప్పటి పరిస్థితులను గూర్చి ఒక ఉద్యోగి చెప్పినగాథే ప్రబల నిదర్శనం:

"సికాసోపైదాడిజరిగింది. లూటీలు జరుపమని ఉత్తర్వులొచ్చాయి. జనాభాను మూకుమ్మడిగా హత్యచేయడం ప్రారంభమైంది. సుమారు నాలుగువేలమంది ఖైదీలను పశువులమందలా తోలారు...ముందుకు సాగమన్నారు. ఒక్కొక్క తెల్లవాడు తనకు నచ్చిన ఒక్కొక్క స్త్రీని ఎన్నుకున్నాడు... విశ్రాంతి లేకుండా ఏకబిగువున 25 మైళ్ళు నడిపించారా ఖైదీలను. డస్సిపోయిన పిల్లలనూ, ఇతర్లనూ రైఫిళ్ళతోనూ, సన్నీలతోనూ పొడిచికాల్చి చంపారు. శవాలను రోడ్లపై వదిలేశారు.

ఒక మహిళ ఎక్కడో ఆక్రందన చేస్తోంది పాపం. ఆమె నిండు చూలాలు. తెల్లవాడు రైఫిల్ మడంపెట్టి ఆవిడను పొడిచాడు. పాపం అలాగే నడుస్తూ నడుస్తూ బిడ్డను కన్నది. బొడ్డు కోసింది. తన బిడ్డ చిట్టితండ్రో, చిట్టితల్లో చూసుకోకుండానే అక్కడే విడిచి వెళ్ళింది ఆ తల్లి."

ఇదీ — ఆఫ్రికా క్షీణదశ దీనితో ప్రారంభమైంది.

కాని ఈనాడు స్వాతంత్ర్యసమరపు వేడిగాలులు ఖండ మంతటా వీస్తున్నాయి.

*　　　*　　　*

ద్వితీయ ప్రపంచయుద్ధంనాటికి ఆఫ్రికా ఖండంలో అయిదు దేశాలుమాత్రమే 'స్వతంత్ర దేశాలు'గా వున్నాయి. ఈ దేశాలు ఇవి: ఇథియోపియా, దక్షిణాఫ్రికాసమాఖ్య, ఈజిప్టు, లైబీరియా, లిబియా, కాని వాస, వసికీ దేశాల ప్రజ లకు అప్పట్లో నిజమైన స్వాతంత్ర్యం లభించలేదనే చెప్పాలి.

ఇప్పటిమాదిరిగానే ఆనాడు కూడా దక్షిణాఫ్రికాలో తెల్లవాళ్ళ పెత్తనమే కొనసాగింది. కీలకమైన ఆర్థిక రంగ మంతా బ్రిటిష్ గుత్తవర్గాల చేతుల్లోనే వుండిపోయింది. ఎన్నడూ కనివినీ ఎరగనంతటి బానిసపద్ధతి అక్కడ పాదుకుని పోయింది.

నాజర్‌కు పూర్వపు ఈజిప్టు అసమసంధులతో సతమత మయింది. వాస్తవానికి బ్రిటిష్ సామ్రాజ్యవాదాని కదొక అర్ధవలస దేశంగా వుండిపోయింది. 1936 లో ఇటలీ సామ్రాజ్య వాదుల ఆక్రమణనాటినుండీ ఇథియోపియా నేటికీ రాచరిక

పాలన క్రిందనే వుంది. పాతగాయాలు మాన్పుకుంది. ఇటలీ వలసలన్నింటినీ స్వేచ్ఛాదేశాలుగా మార్చాలన్న ఐక్యరాజ్య సమితి నిర్ణయానుసారం, లిబియా ఈమధ్యకాలంలోనే స్వతంత్ర దేశంగా అవతరించింది. లైబీరియా అప్పట్లో పూర్తిగా అమెరికా సామ్రాజ్యవాదంపైననే ఆధారపడింది. లైబీరియాలోని అసంఖ్యాకమైన రబ్బరుతోటలపై గుత్తాధిపత్యం వున్న అమెరికా ఫైర్ స్టోన్ కంపెనీ ఆ దేశ ఆర్థికరంగాన్ని నులిమివేసింది. ఆనాటి లైబీరియా ప్రభుత్వ విధానాలపై యీ కంపెనీ ప్రభావం మెండు. మన కాలంలో లైబీరియాలో వచ్చిన మార్పులూ బహుతక్కువనే చెప్పాలి.

అయితే ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ఫాసిస్టు శక్తులు ఓటమి పొందడంవల్ల, ప్రపంచ సోషలిస్టు విధానం రూపొందడంవల్ల, ఆసియాలో వచ్చిన గొప్ప మార్పులూ ఆఫ్రికా ప్రజలందరికీ సంపూర్ణ స్వాతంత్ర్యానికి మార్గాన్ని చూపాయి.

ఫలితంగా ఈజిప్టులో నాజర్ విప్లవం విజయం పొందింది. వర్ణవివక్షను, జాత్యహంకార విధానాన్ని సవాలు చేస్తూ దక్షిణాఫ్రికాలో స్వేచ్ఛావాయువులు వీచసాగాయి. లైబీరియాలో కొత్త ఉద్యమాలు తలెత్తాయి. అరబ్ జాతీయ చైతన్యం లిబియాగుండా దేశదేశాలకు వ్యాప్తి చెందింది. చివరకు రాచరికపాలనలో వున్న ఇథియోపియాను సహితం స్వేచ్ఛా, ప్రజాస్వామ్య సిద్ధాంతాలు వూపివేయసాగాయి.

అంతేగాదు; ఆఫ్రికాఖండంలో గత పది సంవత్సరాల కాలంలోనూ సామ్రాజ్యాలకు సామ్రాజ్యాలే కూలిపోగా,

వాటి స్థానంలో నూతన దేశాలు ఆవిర్భవించాయి. మ్రహీంబ్, ట్యూనీషియా, మొరాకోలు ఫ్రెంచి సామ్రాజ్యవాదానికి భరతవాక్యం పలికాయి. ఆఫ్రికా ఖండంలో ఈశాన్యమూల గానూ, ఇటు పశ్చిమంగానూ వున్న సూడాన్, ఘనాలు స్వాతంత్ర్యం పొందాయి. గినియాకూడా ఫ్రెంచిసామ్రాజ్య వాదంనుండి స్వాతంత్ర్యం పొందింది. ఘనా – గినియాలు కలసి సమైక్యమై, పశ్చిమాఫ్రికా దేశాల సమాఖ్యలో భాగంగా ఏర్పడాలని ఇటీవలనే నిర్ణయించుకున్నాయి.

## 1960........

విప్లవం పరాకాష్టకు చేరుకుంది. దాదాపు 8 కోట్ల ప్రజలకు ప్రజలు స్వేచ్ఛా వాయువుల్ని పీల్చనారంభించారు. తరువాత 1960 వ సంవత్సరం వచ్చింది. ఈ ఏడాది ప్రారంభం కావడం మొదలు, మొత్తం ఆఫ్రికా రూపురేఖలే మారి పోయాయి. ప్రజాప్రతిఘటన దృష్ట్యా ఫ్రెంచి సామ్రాజ్యం రూపమే మారిపోక తప్పలేదు. స్వతంత్ర దేశాలను మరికొంత కాలంపాటు ఆర్థిక బానిసత్వంలో వుంచేనిమిత్తం యేర్పడ్డ బ్రిటిష్ కామన్వెల్త్‌లాగా, కొత్తగా ఫ్రెంచి కామన్వెల్త్ అంటూ ఒక దాన్ని ఫ్రెంచి ప్రభుత్వం యేర్పర్చింది. మాలా, నైగర్, ఐవరీకోస్టు, దహోమీ, చాద్, గాబన్, ఉబాంగీ షారీ, ఫ్రెంచి కాంగోలు స్వతంత్ర దేశాలుగా ఆవిర్భ వించాయి. మడగాస్కర్ "మలగాసీ" రిపబ్లిక్‌గా అవతరించింది. మారిటానియా త్వరలోనే విముక్తం కానున్నది.

జర్మనీ మాజీవలసలైన కామెరూన్, టోగోలాండ్‌లు (ఐరాస ధర్మకర్తృత్వ పాలనక్రింద నున్నవి) 1960 ఏప్రిల్‌లో స్వతంత్రం పొందాయి. బ్రిటిష్ కామెరూన్సు కూడా త్వరలోనే స్వతంత్ర దేశంగా ఏర్పడనున్నది.

ఇటలీ మాజీవలసగావున్న ఎరిట్రియా, ఇథియోపియాతో విలీనమైపోయింది. ఇటలీ వలసైన సోమాలీలాండ్ స్వతంత్రం పొంది, బ్రిటిష్ సోమాలీలాండుతో కలసి సోమాలియా రిపబ్లిక్‌గా అవతరించింది.

బెల్జియం సామ్రాజ్యం కూడా పేకమేడవలె కూలిపోయింది. ఆఫ్రికా ఖండం నడిబొడ్డులో కాంగో రిపబ్లిక్ అవతరించింది.

ఈ విధంగా 1960 వ సంవత్సరం ముగియక మునుపే సుమారు 9 కోట్ల మంది ప్రజలకు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు లభించనున్నాయి. సభ్యదేశాలవరుసలో చేరే మొత్తం ఆఫ్రికా ప్రజల సంఖ్య 16 కోట్లను చేరుకుంటుంది.

వచ్చే సంవత్సరం, మిగిలివున్న పాత బ్రిటిష్ సామ్రాజ్య నిర్మాణ పునాదులు కూడా కదలిపోతాయి. అప్పుడే నైగీరియా ఈ సంవత్సరం అక్టోబరు 1 న స్వతంత్ర దేశంగా ఏర్పడింది. దానితో ఆఫ్రికాలోని పెద్ద భూభాగంలో ఒకటైన నైగీరియా బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పీడవదలించుకున్నట్లే. పోతే, 1961 ఏప్రిల్‌లో సియెరాలియోన్ అనే మరో బ్రిటిష్‌వలస స్వాతంత్ర్యం పొందుతుంది.

ఆఫ్రికాలోని ఉగాండా, కెన్యా, టాంగన్యికా, న్యాసాలాండ్, ఉత్తర, దక్షిణ రొడీషియాలు, బెచునాలాండ్‌లలో

మాజీపాలకుల అధికారాలకు ఎసరువచ్చింది. వచ్చేసంవత్సరం (1961 లో) పూర్తయేలోగానే తూర్పు ఆఫ్రికాలోని బ్రిటిష్ సామ్రాజ్యం మారిపోనన్నా మారిపోతుంది. లేదా ప్రజలే దానినివట్టి బలవంతాన అవతలికి నెట్టినన్నా నెట్టుతారు. ఇది తథ్యం. అంటే 1961 సంవత్సరం పూర్తియేసరికి, సుమారు 19 కోట్ల 50 లక్షలకు పైగా ఆఫ్రికన్లు స్వాతంత్ర్యం పొంద నున్నారన్నమాట !

ఈవిధంగా కోట్లాది ప్రజలు స్వాతంత్ర్యంవైపు సాగి పోతుండగా, దక్షిణాఫ్రికా, ఆంగోలా, మొజాంబిక్, ఆల్జీ రియా, స్పెయిన్‌లలోని జైలుగోడలు బద్దలుకాకుండా ఎంత కాలం మనగలవు ? ఈ వలసలపైకూడా నూతన భానోదయ కాంతులు ప్రసరిస్తున్నాయి.

## ఆఫ్రికా మహాసభల ప్రాశస్త్యం

గత 40 సంవత్సరాలుగా "అఖిలఆఫ్రికా ఉద్యమ" స్వభా వమూ, దాని విధానమూ అస్పష్టంగావున్నా, కొంతవరకు మార్పు చెందింది. ఈ ఉద్యమ స్వభావంలో వచ్చిన అత్యంత ప్రధానమైన మార్పును ఇక్కడ పేర్కొనాల్సివుంది. ఏమంటే ద్వితీయ ప్రపంచ యుద్ధానికిముందు ఈ ఉద్యమం అఖిల ఆఫ్రికా ఉద్యమంగా గాక, "అఖిల నీగ్రో ఉద్యమం" గానే అభివృద్ధి చెందింది. ఈ ఉద్యమం ఇటు ఆఫ్రికాలోని నీగ్రో ప్రజలనూ, అటు అమెరికాలోని ఆఫ్రికా బానిసల నీగ్రో సం తతివారినీ సమైక్యం చేయడానికి తోడ్పడింది.

ఈ ఉద్యమానికి కేంద్రస్థానం ఆఫ్రికాలోగాక అమెరికాలోనే వుండేది. ఇదే ఉద్యమం యొక్క ప్రధాన బలహీనత అని చెప్పాలి: ఏమంటే ఆఫ్రికా, అమెరికా, హైతా, తదితర దేశాలలోని నీగ్రోలందరికీ వుండే సమిష్టి ప్రయోజనాలు బహుకొద్ది. కాని ప్రతీచోట వారు జాతి వివక్షకు గురి చేయబడినందువల్ల, వారి నల్లరంగును పాలకవర్గమైన పెట్టుబడిదారీ వర్గం నీగ్రోలకు ప్రత్యేక సాంఘిక, రాజకీయ విధానాన్ని రూపొందించే పేరుతో స్వప్రయోజనాలకు వినియోగించుకున్నందువల్లా, జాతి వివక్షకు వ్యతిరేకంగా సాగిన పోరాటం "అఖిల ఆఫ్రికా మహోద్యమాని"కి ఒక ప్రాతిపదికగా వుంది. ప్రపంచంలో ఎక్కడకంటే కూడా అమెరికాలోని నీగ్రోలు ఎక్కువ జాతివివక్షకు గురిచేయబడుతున్నారు. అందువల్లనే అఖిలాఫ్రికా ఉద్యమానికి అమెరికా పుట్టినిల్లయింది.

1945 లో మాంఛెస్టర్ లో జరిగిన అఖిలాఫ్రికా ఉద్యమ అయిదవ మహాసభ అనంతరం, ఉద్యమ కేంద్రం ఆఫ్రికా ఖండానికి మారింది. అప్పటినుండీ అది, సామ్రాజ్యవాద బానిసత్వం నుండి ఆఫ్రికా ప్రజలు విముక్తి పోరాటం నడపడమే ఉద్యమ ప్రధాన లక్ష్యంగా వుంది.

<u>చరిత్రాత్మక 'అక్రా' సభ</u>: ఆఫ్రికా చరిత్రలోనే ప్రప్రథమ పర్యాయం 1958 ఏప్రిల్ నెలలో స్వతంత్ర ఘనా రాజధాని అక్రాలో స్వతంత్ర ఆఫ్రికా దేశాలన్నీ కలసి మహాసభ జరుపుకున్నాయి. దీనితో ఆఫ్రికా చరిత్రలో ఒక నూతనాధ్యాయం ఆరంభమైంది. సామ్రాజ్యవాదాన్ని, వలస

విధానాన్ని వ్యతిరేకించే శక్తులన్నింటినీ సమైక్యం చేసేందుకు "అఖిలాఫ్రికా ప్రజామహాసభ" ను జరపాలన్న నిర్ణయమూ ఇదే మహాసభలో తీసుకోబడింది. అప్పటినుండి వరుసనే ట్యూనిస్, మన్రోవియా, కొనాక్రీ, అడిస్ అబాబాలలో ఈ మహాసభలు జరిగాయి. మొన్నమొన్ననే సామ్రాజ్య వాదుల పన్నాగాలలో చిక్కుకున్న స్వతంత్రకాంగోలో కూడా ఒక మహాసభ జరిగింది.

<u>విభజించి - పాలించే సిద్ధాంతం</u>: ఆఫ్రికాను సాధారణంగా అరబ్ ప్రాంతమనీ, "చీకటి ఆఫ్రికా" అనీ వ్యవహరిస్తూండడం జరుగుతోంది. ఈ విభజన సాంస్కృతిక, చారిత్రక అంశాలపై ఆధారపడి జరిగినదే. ఏమంటే ఆఫ్రికాఖండంలోని ఈ రెండురకాల ప్రాంతాలలోని ప్రజలూ విభిన్న సంస్కృతులూ, భిన్నచరిత్ర కలవారూ. కాని "చీకటి ఆఫ్రికా"లో మాత్రం ఒకేరకమైనజాతికి చెందిన ప్రజలు లేరు. ఇక్కడ కూడా విభిన్న సంస్కృతులూ, చరిత్రాకలిగి బహుభాషలు మాట్లాడే ప్రజలు వున్నారు. వారి ఆచార వ్యవహారాలు విభిన్నం. అందువల్ల ఈ ప్రాంతాన్ని అరబ్ ఆఫ్రికాతో కలిపి సమైక్యమైన ఏకప్రాంతంగా గుర్తించడం అంటే ఆందోళన చెందదగంగాని, భయపడ్డంగాని కూడదు. భావంలో యేర్పడ్డ యీ "భిన్నత్వాన్ని," తమ స్వప్రయోజనార్థం సామ్రాజ్య వాదులు సృష్టించినదేగాని వేరుకాదు. "విభజించి-పాలించ" మనే దుర్నీతికి యీ అసహజమైన విభజన మారు పేరు మాత్రమే!

ఎందుచేతనంటే ఆఫ్రికాలో విభిన్న జాతులు నివసిస్తూ వచ్చాయి. అయితే గత శతాబ్దంగా వారి భవిష్యత్తునంతా ఒకే రకమైన చీకటి ఆవరించింది. వారంతా సామ్రాజ్యవాద దోపిడీకి, వలస బానిసత్వానికి గురైనవారే. సామ్రాజ్యవాదం వారందరి ఉమ్మడి శత్రువు. వలస బానిసత్వ శృంఖలాలను ఛేదించడమే వారి ఏకైక లక్ష్యంగా వుంది. ఈనాడు ఈ రెండు ప్రాంతాలలోని ప్రజలూ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఐక్య పోరాటాన్ని నడుపుతున్న విషయం వర్తమాన చరిత్రను పరిశీలిస్తున్నవారందరికీ అవగతమవుతుంది.

ఆర్థిక స్తోమత: వలసపాలన ఫలితంగా ఆఫ్రికా దేశాలకు బడుగు ఆర్థిక వ్యవస్థ సంక్రమించింది. అందువల్లనే నేడు స్వతంత్రత పొందిన, పొందుతున్న ఆఫ్రికా దేశాల ఆర్థికస్థితి హీనదశలో వుంది. పరిశ్రమలు లేవు, రహదార్లు లేవు, వ్యవసాయం లాభదాయకంగా లేదు. ఇవీ ఈ దేశాలు నేడెదుర్కొంటున్న ప్రధాన సమస్యలు. ఈ అదను చూసుకొని వలస పెత్తందార్లు, నూతన స్వతంత్ర దేశాలను తమ పలుకుబడిలోనే వుంచుకొనేందుకై రాజకీయేతరమైన సరికొత్త పన్నుగడలకు దిగుతున్నారు. అందుకే వారు యూరో - ఆఫ్రికా అనే కొత్త నినాదం లేవనెత్తారు. ఆఫ్రికా దేశాల ఆర్థికవ్యవస్థను యూరోప్ దేశాల ఆర్థికరంగానికి ముడిపెట్టి వుంచడం లేదా అనుబంధం చేయడమే ఈ దుష్టపన్నాగం యొక్క లక్ష్యం. ఈ దశలో సోవియటు, తదితర సోషలిస్టు దేశాలు నూతన ఆఫ్రికా దేశాలతో (ఉదాహరణకు గినియా, ఈజిప్టు, కాంగో వగైరా) ఎట్టి షరతులూ లేని పరస్పర లాభ

దాయకమైన పద్ధతిలో వ్యాపార ఒప్పందాలను కుదుర్చు కోవడం, ఆ యా దేశాలకు నిస్వార్థచిత్తంతో అందిస్తున్న ఆర్థిక సహాయం ఆఫ్రికా దేశాలలో స్వతంత్ర ఆర్థికాభివృద్ధి పట్ల మరింత ఆసక్తిని పురిగొల్పింది. తమ నిజమైన మిత్రులు సోషలిస్టు దేశాలేనని యిప్పుడిప్పుడూ వారు గ్రహిస్తున్నారు.

నయావలస విధానం: 1957 నుండి బ్రిటన్ బడుగు దేశాల కందిస్తున్న 'సహాయం' యింకా యెక్కువైందనీ, ఇది ఏడాదికి 50 కోట్ల పౌన్ల రేటు చొప్పున పెరుగుతుందని బ్రిటిష్ వ్యాపారమండలి అధ్యక్షుడు రెగినాల్డ్ మాల్డింగ్ ఇటీవల ఒక సందర్భంలో చెప్పారు. ఈ దేశాలకు బ్రిటిష్ ప్రయివేటు పెట్టు బడులు ఏడాదికి 30 కోట్ల పౌన్ల చొప్పున ఎగుమతి అవు తున్నాయి. 1958-62 సంవత్సరాల మధ్యకాలంలో బడుగు దేశాలలో ఫ్రాన్స్ 100 కోట్ల పౌన్ల ధనాన్ని ఖర్చు చేయాలని నిర్ణయించింది. ఇదిగాక, కొత్తగా అమెరికా నాయకత్వాన ఏర్పడిన అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థలో వాల్గొనాలనికూడా ఫ్రాన్స్, బ్రిటన్‌లు నిర్ణయించాయి. ఈ సంస్థవద్ద 100 కోట్ల పౌన్ల నిధి నిల్వ వుంటుంది. ఇవిగాక ఉమ్మడిమార్కెట్ (కామన్ మార్కెట్) దేశాలన్నీ కలసి "యూరోప్ ఆర్థికసంస్థ" నిధి మొత్తంలో 8 కోట్ల 10 లక్షల పౌన్లు భరిస్తామని అంగీకరిం చాయి.

విదేశీ భూభాగాలపైన ఈ దేశాలకు ఇంత "ప్రేమ" ఇంత హఠాత్తుగా పుట్టుకురావడానికి కారణం లేకపోలేదు. ఈ రకమైన ఆర్థిక దోపిడీకి జరిగే ప్రయత్నాన్నే ట్యూనిస్‌లో జరిగిన ఆఫ్రికా ప్రజామహాసభ "నయా (సరికొత్త) వలసవిధా

నం" అని విమర్శించింది. కుళ్ళి కంపు కొడుతున్న పాతపద్ధతుల ద్వారా ఈ ప్రాంతాలపై ఆధిపత్యం చెలాయించడం సాధ్యం కాని రోజులివి సామ్రాజ్యవాద దేశాల ఆర్థిక వ్యవస్థను పదిల పర్చుకోవడానికి ఈ దేశాలను ముడిసరుకు ఉత్పత్తిచేసే ప్రాంతాలుగా అంటగట్టడం కుదరని రోజులివి. అందువల్లనే సామ్రాజ్యవాద గుత్తాధిపతులు తమ పాతదోపిడీని కొత్తపద్ధతులద్వారా, కొత్త ఎత్తుగడలద్వారా పునః ప్రతిష్ఠాపించాలని యత్నిస్తున్నారు. అనేక రకాల కిరాతకచర్యలకు ఒడిగట్టిన వలసవాదులంతా ఈనాడు సమైక్యమవుతున్నారు. వారందరినీ అమెరికా బలపరుస్తోంది. ప్రత్యక్షసహాయం అందజేస్తోంది. అందుకే ట్యూనిస్ మహాసభ ఈ పద్ధతిని "సమిష్టి సామ్రాజ్య వాదం" అని ఘాటుగా విమర్శించింది.

అయితే ఈనాడు ఆఫ్రికా దేశాలలోని నూతన నాయకత్వం ఈ రకమైన "సహాయక" పథకాలపై ఎట్టి భ్రమలూ పెట్టుకోబోవడంలేదు. సామ్రాజ్యవాదులకూ, గుత్తవర్గాలకూ వున్నంత తెలివితేటలూ, అంతకన్న ఎక్కువ సమయస్ఫూర్తి ఆఫ్రికా నాయకులకి కూడా వున్నాయని ఇటీవలి చరిత్ర రుజువు చేస్తోంది. ఈ "సహాయ" పథకాలు ఆఫ్రికాను ప్రధానంగా వ్యవసాయ ప్రాంతంగానే అట్టిపెట్టాలని పారిశ్రామికీకరణజరుగకుండా ప్రయత్నిస్తున్నాయని ఆఫ్రికా నాయకులకు తెలుసు. పరిశ్రమలు లేకుండా ఏ దేశమూ వాస్తవమైన సమానత్వాన్ని సాధించలేదని కూడా వారికి తెలుసు. స్వతంత్ర భారత ప్రజల అనుభవమూ ఇదే.

## భారతదేశమూ - ఆఫ్రికా

ఆఫ్రికాతో, మన దేశానికి వున్న సంబంధాలు చాల సంవత్సరాల నాటివి. భారతజాతీయ కాంగ్రెసు నాయకత్వాన సాగిన స్వాతంత్ర్యోద్యమాన్నీ, ఆర్థికాభివృద్ధికై మనం సాగిస్తున్న కృషినీ ఆఫ్రికా నాయకత్వం శ్రద్ధగా పరిశీలిస్తోంది. ఆఫ్రికా నాయకులు సోవియెట్టు దేశ విప్లవానుభవాలతో పాటు భారతదేశానుభవంనుండి కూడా ఉత్తేజితులైనారు. ఆఫ్రికాలో తెల్లవాళ్ళ జాత్యహంకారాన్ని ఎదిరించి నిలబడిన మొదటి వ్యక్తి గాంధీజీ అన్న విషయం ప్రతిఒక్క ఆఫ్రికావాసికీ తెలుసు. మన ప్రధాని నెహ్రూ ప్రస్తుత విదేశాంగనీతిని ఆఫ్రికా గుర్తిస్తోంది; వీటన్నింటికంటె ప్రధానంగా, సామ్రాజ్యవాద దాసిసత్వంనుండి బయటపడ్డ ఆఫ్రికాదేశాలు తిరిగి ఆ వాగురలో చిక్కుకోకుండా తటస్థ వైదేశిక నీతిని అనుసరించడం ప్రపంచశాంతి ఉద్యమానికొక అమూల్యాభరణ .

## ఆఫ్రికా కార్మికవర్గం

20 వ శతాబ్దం పూర్వార్థభాగంలో ఆఫ్రికాలోని పెద్ద పెద్ద పట్టణాలలోని జనాభా ఏడింతలు పెరిగింది. 19 వ శతాబ్దం ఆఖరున పశ్చిమదేశాల గుత్తవ్యాపార వర్గాలు ఆఫ్రికా సంపదను దోచుకోవడానికి చొచ్చుకు వచ్చాయి. వారు లక్షలాది రైతులను సాగుచేసుకుంటున్న భూములనుండి బేదఖల్ చేసి, వాటిని తమ హక్కుభుక్తం చేసుకున్నారు. మరి రైతాంగానికి గతేమిటి? నిన్నటి రైతులు బొగ్గు, తగరపుగనుల్లో పనులకు దిగారు. ఓడరేవుల్లో బస్తాలూ, అవీ మోసే మోటకూలీలుగా

మారారు. భూములు కోల్పోయిన రైతులు కేవలం దారిద్ర్యం, కడుపు చిచ్చువల్లనే ఈస్థితికి దిగాల్సివచ్చింది. కాని వారు పనుల నిమిత్తం పట్టణాలు చేరినా అక్కడా దారిద్ర్యం, ఆకలీ వెన్నాడాయి. ఫలితంగా తీవ్రమైన దోపిడీకి, వర్ణవివక్షకు గురి అయ్యారు.

ఈ విధంగా ఆఫ్రికాలో కార్మికవర్గం తలెత్తింది. ఇక్కడి కార్మికవర్గ చరిత్ర స్వల్పమైనదే కావచ్చు. కాని అందులోనే పెద్దపెద్ద తుఫానులు లేపే సంఘటనలూ వున్నాయి; వలస దాస్యానికి వ్యతిరేకంగా పోరాటదీక్ష ఆ చరిత్రలో గర్భితమై వుంది. 1913 ఆ ప్రాంతంలో దక్షిణాఫ్రికా బంగారు గనుల్లో జరిగిన సమ్మె ఎంత తీవ్రస్థాయిలో జరిగిందంటే, గని కార్మికుల్ని అణచివేయడానికి వలసాధికారులు పెద్ద ఎత్తున పోలీసుదళాలను వినియోగించాల్సివచ్చింది. ఈ పోలీసు చర్యనుగూర్చి ఒక అధికార నివేదికలో యిలా ఉంది: "పోలీసు దళాలు వచ్చినా ఏమీ లాభం లేకపోయింది. పోలీసులతో హోరాహోరీ పోరాటానికి స్థానిక ప్రజలంతా సిద్ధమైనారు. ఒక గనివద్ద వారు పోలీసులపై రాళ్ళవర్షం కురిపించారు. అయితే సైన్యాన్ని రంగంలోకి దించిన తరువాత మాత్రమే ఈ ప్రతిఘటనను వలసాధికారులు నిరోధించగలిగారు. అదయినా కార్మిక నాయకుల్ని అరెస్టు చేయడంవల్లనే సాధ్యమైంది."

ఈవిధమైన తిరుగుబాట్లకు వ్యతిరేకంగా వలసాధిపతులు కార్మిక నివాస ప్రాంతాలన్నింటిచుట్టూ ముళ్ళకంచెలు పాతేశారు. "పాస్ పుస్తకాల" పద్ధతిని ప్రవేశపెట్టారు. సభలనూ, సమావేశాలనూ నిషేధించారు. వలసాధిపతులు ఎన్నికుట్రలు

పన్నినా, యెన్ని నిర్బంధాలు విధించినా, తమపట్ల వలస వాదులు తలపెట్టిన అవమానాన్ని కార్మికులు ససేమిరా అంగీకరించలేదు. 1935 లో ఉత్తర రొడీషియాలోని రాగిగనులలో సంభవించిన రక్తపాతం ప్రపంచాన్ని ఊపివేసింది. ఎనిమిదిరోజుల పాటు వరుసనే కార్మికులు గనుల్లోకి పోనిరాకరించారు. కార్మికుల్ని మేనేజిమెంటు దొంగచాటుగా తీసుకెళ్ళి చావమోది వదలిపెట్టింది. కార్మికుల కోర్కెల్ని నిరాకరించింది. పోలీసుల్ని రప్పించి సమ్మె చేస్తున్న కార్మికులపై కాల్పులు జరిపించింది. ఆరుగురు కార్మికులు చనిపోయారు. 200 మందికిపైగా గాయపడ్డారు.

యూనియన్లు (సంఘాలు) ఏర్పర్చుకోడానికి ఆఫ్రికన్ కార్మికులు చేసిన ప్రయత్నాలను వలసవాదులు ఎప్పటికప్పుడు మొగ్గలోనే తుంచివేస్తూవచ్చారు. 1920 లో దక్షిణాఫ్రికాలో తలెత్తిన యూనియన్లు, 1929 లో గాంబియాలోనూ, ఆ తరువాత కెన్యాలోనూ ఏర్పడ్డ కార్మిక సంఘాలన్నీ పూర్తి సంఘాలుగా గాక, అప్పుడప్పుడూ అజ్ఞాత సంఘాలుగా పని చేయాల్సివచ్చింది. 1937 లో ఫ్రెంచి పశ్చిమాఫ్రికా వలసపాలకులు ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలను నిషేధించారు. అయితే దానితోనే వారికి సంతృప్తి కలుగలేదు. మూడు సంవత్సరాల నిషేధం అనంతరం తిరిగి మరోసారి నిషేధించివేశారు!

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఆఫ్రికా జాతీయ విముక్తి ఉద్యమ చరిత్రలో నూతన శకారంభమైంది. ఎన్ని నిర్బంధాలున్నప్పటికీ, ఎంతటి ఘోరకృత్యాలు వలస

వాదులు తలపెట్టినప్పటికీ గోల్డుకోస్టు (ఇప్పటి ఘనా); గాంబియా, సియెర్రాలియోన్ దేశాల కార్మికవర్గం సమైక్యం కాకుండా నిరోధించలేకపోయారు. వలసాధిపతులు ఎన్ని అవాంతరాలు కల్పించినా, కెన్యా, ఉగాండా, టాంగన్యీకా, నైగీరియా, ట్యునీషియా, మొరాకో, ఆల్జీరియా, కామెరూన్స్, సూడాన్, సెనిగల్, ఐవరీకోస్టు వగైరా దేశాలన్నిటా కార్మిక సంఘాలు ఏర్పాటు కాజొచ్చాయి. ఉత్తరాన ఆల్జీరియానుండి దక్షిణాన దక్షిణాఫ్రికా వరకూ, పశ్చిమాన గినియానుంచి తూర్పున కెన్యావరకూ యావత్తు ఆఫ్రికాఖండంలోనూ యువ కార్మిక సంఘాలు బ్రహ్మాండమైన పోరాటాన్ని నడపాల్సివచ్చింది. ఆఫ్రికాలోని బ్రిటిష్ సామ్రాజ్యవలసల్లోకల్లా పెద్దదైన నైగీరియాలో 1945 లో సార్వజనీన సమ్మె జరిగింది. సమ్మెకు ముందు రెండుసంవత్సరాల క్రితమే నెలకొల్పబడ్డ "నైగీరియా యూనియన్ల మహాసభ" ఆధ్వర్యాన యీ సమ్మెజరిగింది. ఇది 44 రోజులపాటుసాగింది. తుదకు కార్మికులే విజయంసాధించారు. 1946లో డాకార్‌లో మరోపెద్దసమ్మెజరిగింది ఆ తరువాత దక్షిణరొడీషియా, బెల్జియన్ కాంగోలలో రైల్వే కార్మికులుసమ్మె చేశారు. బెల్జియన్‌కాంగోలోని మతాదాలో సమ్మె చేస్తున్న కళాశాలపైకి సైన్యాన్ని వదిలారు. అటు దక్షిణాఫ్రికాలో "ఉక్కు కార్పొరేషన్ పరిశ్రమల"న్నీ కార్మిక వివాదాలతో సతమత మవుతున్నాయి. తమ దేశ రాజకీయార్థిక స్వాతంత్ర్య సాధనకూ, జీవన స్థితిగతులను మెరుగు పర్చుకొనేందుకూ పోరాడేందుకై యూనియన్లన్నీ జాతీయవిముక్తి ఉద్యమంలో చేరాయి. దీనితో వలసాధివర్గాల కాళ్ళు చల్లబడ్డాయి. ఇక

మీాదట పోటీ యూనియన్లు నెలకొల్పేందుకు పూనుకొన్నారు. సిసలైన ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్య పోరాటంనుండి కార్మికుల్ని ప్రక్కదార్లు పట్టించడమే వలసాధిపతులు నెలకొల్పే ఆ 'పోటీ యూనియన్ల' ఉద్దేశం. ఇటువంటి 'యూనియన్లు' వలసవాదులకు జోహుకుం అంటూ జాతీయోద్యమాసికి, న్యాయబద్ధమైన పోరాటాలకు వ్యతిరేకంగా పనిచేయ నారంభించాయి. అదే సమయంలో వలసాధిపతులు చైతన్యవంతమైన కార్మిక సంఘాల నాయకులపై నిర్బంధవిధానం అమలు జరిపారు. కార్మిక వ్యతిరేక చట్టాలు నిరంకుశంగా తయారు చేశారు. ఉదాహరణకు బెల్జియం వలసగా వున్న కాంగోలో ఆఫ్రికన్ ట్రేడ్ యూనియన్లన్నింటినీ 1956 వరకూ పూర్తిగా నిషేధించివేశారు. ఉత్తర రొడీషియాలో వలసవాదులు కార్మిక సంఘాల నిర్బంధ రిజిస్ట్రేషన్ పద్ధతిని ప్రవేశపెట్టి, తమకు నచ్చని సంఘాలన్నీ రద్దుకావాలని వలసాధికారవర్గాలు ఉత్తర్వులిచ్చాయి. ఇదే రకమైన పరిస్థితులు ఇతర వలసల్లో కూడా అమలులో వున్నాయి.

అయితే ఈ రకమైన విపరీత నిర్బంధ విధానం సహితం కార్మికవర్గ చైతన్యాన్నీ, వారి పోరాటదీక్షనూ, సడలించలేక పోయింది. అగ్నిపరీక్ష వచ్చినప్పుడల్లా ఆఫ్రికా యూనియన్లన్నీ జాతీయ విముక్తి ఉద్యమంలో పాల్గొన్నాయి. సుఖ జీవనంకోసం కార్మికుల హక్కుల్ని ఆ సంఘాలు ఎలుగెత్తి చాటాయి.

<u>ఐక్య కార్మికోద్యమం</u> : "కొన్ని దశాబ్దాలనాడు ఆఫ్రికాలోని ఒక ప్రాంతంలో నివసించే తెగలుగలవారెవరో మరో

ప్రాంతంలో వారికి తెలిసేదికాదు ... పది సంవత్సరాలక్రితం మేమంతా కేవలం కికుయూ, చగ్గా, నోసీ, జులూ లేదా ఫాంతీలం మాత్రమే"అని కెన్యా రచయిత జాన్ ఒసాగో అనే ఆయన ఒక పత్రికలో వ్యాసం వ్రాస్తూ తెలియజేశాడు. ఐతే వలస బానిసత్వానికి వ్యతిరేకంగా కెన్యా ప్రజలు గత పది సంవత్సరాలుగా నడిపిన వీరోచిత పోరాటం, పై తెగలన్నింటినీ సమైక్యం చేసే పనికన్నా ఇంకా ఎక్కువ ఘనకార్యాన్నే సాధించింది. ఈ తెగలన్నింటినీ ఆఫ్రికాఖండంలోని మిగతా ప్రాంతాల ప్రజలందరితోనూ ఐక్యం చేసింది.

ఆఫ్రికా కార్మికవర్గం కూడా యిదేరకమైన ఐక్యతను సాధించిందనే చెప్పాలి. పదిమందిలో పెట్టి, తప్పుల్ని దులపడమంటే అధికారులు భుజాలు తడుముకొనేవారు. కాని ఆ రోజులు పోయాయి. కళ్ళకు కనపడుతున్న వాస్తవిక విషయాలను ప్రజలనుండి ముసుగుపుచ్చడం యిప్పుడు సాధ్యంకాని పని. ఆఫ్రికా కార్మికవర్గానికి చెందిన యీక్రింది వాస్తవ పరిస్థితిని గమనిద్దాం:

1947: గాంబియా, బెల్జియంకాంగో, దక్షిణాఫ్రికా, అల్జీరియా, సెనిగాల్, మారిటానియా, టోగోలాండ్, మొరాకో, ఫ్రెంచి కామెరూన్స్, సూడాన్, గినియా, డాకార్, మడగాస్కర్, ఐవరీకోస్టు, సిర్రాలియోన్, నైగీరియా, గాబన్, దహోమీ, ట్యునీషియాలకు చెందిన 8 లక్షల మంది కార్మికులు ఆఫ్రికా చరిత్రలో ప్రప్రథమంగానే జరిగిన అఖిలాఫ్రికా ట్రేడ్ యూనియన్ మహాసభకు హాజరైనారు. మహాసభ డాకార్‌లో జరిగింది. దీనిని ప్రపంచ ట్రేడ్ యూనియన్

సమాఖ్య బలపర్చింది. తాము నడపాల్సిన అకుంఠితమైన పోరాటాన్ని గూర్చి ఆఫ్రికా కార్మికోద్యమ నాయకులంతా ఆ మహాసభలో ఒకరి అనుభవాలను మరొకరు తెలుసు కున్నారు.

1949 : 7,500 మంది గని కార్మికుల జీతాల పెంపు దలను కోరిన ఫలితంగా నైగీరియాలోని "ఎనుగూ బొగ్గు" ప్రాంతంలో బ్రహ్మాండమైన సమ్మె జరిగింది మేనేజిమెంటు పోలీసుల్ని పిలిచారు. పోలీసులు కార్మికులపై కాల్పులు సాగించారు. ఫలితంగా 60 కార్మిక కుటుంబాలకు జీవనోపాధి సంపాదించిపెట్టే దిక్కు లేకుండాపోయింది. వలసాధిపతులు ఆ కుటుంబాల ఉసురు పోసుకున్నారు. ఇందుకు ప్రతిఫలంగా నైగీరియాలోని యూనియన్లన్ని కలిసి ఒక సమాఖ్యగా ఏర్పడ్డి ఈ ఘోర హత్యాకాండకు బాధ్యులైన వలసాధికారులపై సంయుక్త కార్యాచరణకు పూనుకున్నాయి.

1951 : కార్మికవర్గ ప్రయోజనాలకు అనుగుణంగా కార్మిక నిబంధనావళి ఒకటి తయారుకావాలని డిమాండ్ వచ్చింది. దాన్ని బలపరుస్తూ, సంయుక్త కార్యాచరణకు పూనుకోవడం కోసం ఫ్రెంచి సూడాన్ రాజధాని బమాకోలో 14 వలస దేశాలనుండి ట్రేడ్‌యూనియన్ ప్రతినిధులు సమా వేశమైనారు. వలసదేశాల్లోని కార్మికోద్యమాలను సమన్వ యించేందుకై సమావేశం ప్రత్యేక కమిటీలను యేర్పర్చింది.

1953 : ఆఫ్రికా ట్రేడ్‌యూనియన్ ద్వితీయ మహా సభ బమాకోలో జరిగింది. కార్మికవర్గ సాంఘిక, రాజకీయ

హక్కులకోసం పోరాటంలో ఐక్యతే ఈమహాసభ ఎజెండాలో మరోసారి ద్యోతకమయింది.

1955 : మొంబాసాలోని 10 వేలమంది కళాసీలు సమ్మె చేశారు. వీరికి సానుభూతి ప్రదర్శిస్తూ, విద్యుచ్ఛక్తి కర్మాగార కార్మికులు; రవాణా, నూనె గని కార్మికులూ సమ్మెచేశారు. చివరకు కార్మికులే విజయం సాధించారు.

1957 : ఆఫ్రికా జనరల్ వర్కర్స్ యూనియన్‌ను స్థాపించాలని కోటోనూ (దహోమీ) మహాసభ నిర్ణయించింది. ఈ యూనియన్‌లో తొమ్మిది దేశాలకు చెందిన కార్మిక సంఘాలు చేరాయి: గినియా, సెనిగాల్, ఐవరీకోస్టు, నైజీరియా, దహోమీ, అప్పర్ ఓల్టా, మారిటానియా, టోగోలాండ్, కామెరూన్స్.

1959 : జనరల్ వర్కర్స్ యూనియన్ ప్రథమ మహాసభ జనవరిలో జరిగింది.

ఈ యూనియన్‌లో ఇప్పుడు మొత్తం 2 లక్షల 50 వేల మంది సభ్యులున్నారు. వారిలో సగంమంది పశ్చిమాఫ్రికాలోని కార్మికులే వున్నారు. వలస విధానానికి స్వస్తి చెప్పడం ఈ యూనియన్ లక్ష్యం.

ఉత్తర, దక్షిణ రోడీషియా సరిహద్దుల్లోవున్న కారిబా డాంను నిర్మిస్తున్న కార్మికులు న్యాసాలాండ్‌లో వలసవిధానానికి వ్యతిరేకంగా వచ్చిన తిరుగుబాటుకు సానుభూతి సూచకంగా మార్చిలో డాం కార్మికులు సమ్మె చేశారు. 1959 ఆకురాలుకాలంలో కాంగో, కెన్యా, ఉగాండా, టాంగన్యీకాలలో సమ్మెల కారణంగా రైళ్ళ రాకపోకలన్నీ బంద్

అయినాయి. దక్షిణాఫ్రికాలో ఇంకా పెద్దపెట్టున సమ్మె పోరా టాలు నడిచాయి.

1960 : ఉగాండాలో మార్చి నెలలో తేయాకుతోట కార్మికులు సమ్మె చేశారు. దక్షిణాఫ్రికాలోని కార్మికవర్గం జాతి వివక్షకు వ్యతిరేకంగా సార్వజనీనసమ్మె నడిపింది. కెన్యా, ఆఫ్రికన్ యూనియన్ నాయకులు జాతీయోద్యమ నాయకులైన జోమో కెన్యాట్టాను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ, కెన్యా కార్మికులు ఏప్రిల్ 15 న ఒకరోజు సమ్మె జరి పారు.

రాజకీయ జీవితంలో ఆఫ్రికా యూనియన్ నాయకులు ప్రముఖపాత్ర వహిస్తున్నారనే చెప్పాలి. ఇటీవలి సంవత్సరా లలో స్వాతంత్ర్యం పొందిన దేశాలలో యీ నాయకులలో చాలమంది ప్రముఖ ప్రభుత్వపదవులను నిర్వహిస్తున్నారు. ఉదాహరణకు యీనాడు గినియా అధ్యక్షులైన సెకౌటూరే స్వదేశంలో ట్రేడ్ యూనియన్ సమాఖ్యకు నాయకత్వం వహించడమే గాదు; ఆఫ్రికా జనరల్ వర్కర్స్ యూనియన్‌కు కూడా నాయకత్వం వహిస్తున్నారు. అలాగే కెన్యా కార్మిక నాయకుడు టాంబోయా కెన్యాలో ఒక రాజకీయపార్టీకి నాయ కత్వం వహిస్తున్నారు. కెన్యా విముక్తి పోరాటంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు.

అఖిలాఫ్రికా ట్రేడ్ యూనియన్ సమాఖ్యను నెల కొల్పేందుకు ఇప్పుడు ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ పని మీదనే గత సంవత్సరం నవంబరు మాసంలో సన్నాహక సంఘం ఆక్రాలో సమావేశమైంది. ఈ సమావేశానికి ఘనా,

కెన్యా, మొరాకో, ఆల్జీరియా, అరబ్ ట్రేడుయూనియన్ల అంతర్జాతీయ సమాఖ్య, ట్యునీషియా, గినియా, టోగో లాండ్, రొడీషియా, నైగీరియా, ఉగాండా, దక్షిణాఫ్రికాల నుండి ప్రతినిధులు హాజరైనారు. ఇతర అంతర్జాతీయ ట్రేడ్ యూనియన్ కేంద్రాలతో సంబంధం లేకుండా స్వతంత్ర సమాఖ్యను నెలకొల్పాలని అందులో అన్ని ఆఫ్రికన్ ట్రేడ్ యూనియన్లకు అవకాశంవుండాలనీ సన్నాహకసంఘం ఆఫ్రికా యూనియన్లన్నింటికీ పిలుపు నిచ్చింది.

అద్యతనభావిలో ఏర్పడనున్న ఈ మహా సమాఖ్యలో జాతీయ ట్రేడ్ యూనియన్లన్నీ స్వపరిపాలిత సంస్థలుగా చేర నున్నాయి. ప్రస్తుతం ఇవి ఆఫ్రికా స్వాతంత్ర్య పోరాటంలో సహకారం, సమైక్యత, సంపదైశ్వర్యాలు, అఖిలాఫ్రికా ప్రజల ప్రయోజనాలు, వారి ఆర్థికాభివృద్ధి, ప్రజాస్వామ్య వ్యవస్థా నిర్మాణం విషయమై చర్చించాయి. ఈసంవత్సరం ఆగస్టులో అఖిలాఫ్రికా ట్రేడ్ యూనియన్ సమాఖ్య ప్రారంభ మహా సభ కాసబ్లాంకాలో జరిగింది.

వలస వ్యతిరేక శక్తుల సమైక్యతకు శత్రువులైన వారం దరికీ సుస్థిరమైన ఆఫ్రికా కార్మికవర్గ ఐక్యత సింహస్వప్నంలా తయారైంది. ఆఫ్రికా మహాసభవైపు నుండి కార్మిక వర్గం దృష్టిని మరల్చే దృష్టితో, "స్వేచ్ఛా వ్యాపార సంఘాల అంతర్జాతీయ సమాఖ్య" అనే సంస్కరణవాద ముఠా తన ప్రాంతీయ ఆఫ్రికా మహాసభను అక్రామహాసభ జరిగినప్పుడే లాగోస్‌లో జరిపింది. కార్మికోద్యమాన్ని దెబ్బకొట్టడానికి ఇదొక నూతనప్రయత్నం.

అయితే యీ ముఠా నాయకులు విఫలులైనారు. రాజకీయార్థిక పోరాటపథంనుండి ఆఫ్రికన్ కార్మిక వర్గాన్ని మరల్చడం వారితరం కాలేదు.

## ఆఫ్రికాలో అమెరికా దోపిడి

ఆసియాలో ఇటీవల నూతన పరిణామాలు రావడంతో ఆఫ్రికా ఖండంలో అమెరికా దోపిడీ పద్ధతుల్లో కూడా కొంత మార్పు వచ్చింది. ఆసియా ప్రజలపై పెత్తనం సాధించడంలో సామ్రాజ్యవాదం ఓడిపోయిందని 1955 నాటి బాండుంగ్ మహాసభ అమెరికా రాజకీయవేత్తలను హెచ్చరించింది! పోతే ఆఫ్రికా అంటే అమెరికాకున్న భావాన్ని అమెరికన్ సామ్రాజ్యవాద భావాలను బలపర్చే జాన్‌గంథర్ అనే ప్రఖ్యాతరచయిత తన "ఆఫ్రికా ఖండంలో"(Inside Africa) అన్న గ్రంథంలో (1955 లో ప్రచురితం) యిలా వ్రాశాడు:

"ఆఫ్రికా సంపదవంతమైన ఖండం. ఇదొక పెద్ద సవాలు కూడా. ఈ ఖండం కీలకప్రాంత మవట మొక్కటే కాదు. ఇందు అత్యంత ప్రధానమైన ముడిసరుకులు లభించ డమే గాదు. ఇది మన (అమెరికన్ల)కు దక్కాల్సిన తుట్టతుది ప్రాంతం. ఆసియాలో చాలభాగం ఇప్పటికే చేయిజారిపోయింది. ఇంక ఆఫ్రికా ఒక్కటే వుంది. అయితే ఆఫ్రికా ప్రస్తుతం "శూన్య"ప్రాంతంగా వుంది. ఇంతకన్నా సంపద్విలసితమయిన ప్రాంతం ప్రపంచంలో వుండదు."

ఆఫ్రికాలో అమెరికాయొక్క ప్రత్యేక ఆర్థిక ప్రయోజనా లేమిటో 1957 లో ఒక సెనేటర్ అమెరికా పార్ల

మెంటులో అరమరికలు లేకుండా కుండ బ్రద్దలుకొట్టినట్లు చెప్పాడు: ఆఫ్రికాఖండానికి అమెరికా ప్రభుత్వం "నూతన సహాయక పథకం" ఒకటి తలపెట్టాలని సూచించా డాప్రతినిధి. పశ్చిమాఫ్రికాకు "ప్రాంతీయ పథకాన్నొకదాన్ని" తయారు చేస్తోందని కూడా యిటీవల ఘనా రాజధాని ఆక్రాలో మాట్లాడుతూ అమెరికా సెనేటర్ హారామాన్ అన్నాడు. ప్రస్తుత ఐరాస 15 వ సర్వసభ్య సమావేశ ప్రారంభ ప్రసంగంలో కూడా అమెరికా అధ్యక్షులు ఐసెన్‌హోవర్ దా నాపు యిటువంటి సూచననే ఒకదాన్ని చేశారు. నిరాయుధీకరణ లాంటి ప్రధాన సమస్య పరిష్కారమయితే, బడుగు దేశాలకు అపారమైన సహాయం అందించవచ్చుననే సాధారణసూత్రాన్ని కాలదన్ని, మారురూపంలో తమ గుత్తాధిపత్యాన్ని, ఆర్థిక దోపిడీని కొనసాగించే ఉద్దేశంతోనే అమెరికా పాలకవర్గాలు అక్కడి గుత్తవర్గాలతో యీ యెత్తు యెత్తారు.

తమ జేబులు నింపుకోడానికి యీ మహాఖండం (ఆఫ్రికా) వినియోగపడకుండా అమెరికా గుత్త వ్యాపారుల నెవరూ అడ్డుకోలేదు. కేవలం యిటువంటి ప్రభుత్వం ఆర్థిక సహాయక పథకాలు కొరతగా ఉన్నంత మాత్రాన గుత్తాధిపతుల దోపిడీ నిరాఘాటంగా సాగకుండా పోలేదు. ద్వితీయ ప్రపంచ యుద్ధానికి ముందు ఆఫ్రికాలో అమెరికా ప్రయివేట్ గుత్తవర్గాలు పెట్టిన పెట్టుబడి మొత్తం 8 కోట్ల 10 లక్షల డాలర్లు (1 డాలర్=సుమారు రు. 5 లు). యుద్ధంపూర్తయేసరికి ఈమొత్తం 29 కోట్ల 60 లక్షలడాలర్లకు పెరిగింది. ఇది 1958 నాటికి 73 కోట్ల 90 లక్షల డాలర్లు

అయింది. ఈనాడు ఆఫ్రికాలో 200 అమెరికన్ గుత్త సంస్థలు పనిచేస్తున్నాయి. ఇవన్నీ ప్రధానంగా ఖనిజ సంపదను వెలికి తీసి, దానిని అమెరికాకు తరలించుకుపోయే కార్యక్రమంలో నిమగ్నమైవున్నాయి. ముఖ్యంగా కీలకమైన ముడి సరుకులపై ఈ సంస్థలు ఎక్కువ కేంద్రీకరించాయి. యురేనియం, వజ్రాలు, కోబాల్టు, ఖనిజాలు కాంగోనుండి అమెరికాకు వెళ్తున్నాయి. మధ్యాఫ్రికా సమాఖ్యనుండి రాగి, క్రోమియం, మాంగనీసు; ఘనానుండి బాక్సైట్, లైబీరియానుంచి రబ్బరు; మొరాకోనుండి సీసం అమెరికాకు చేరవేసుకుంటున్నారు. ఆఫ్రికాలో ఇప్పుడిప్పుడే అభివృద్ధిలోకి వస్తున్న నూనె పరిశ్రమ లోకికూడా అమెరికా గుత్తపెట్టుబడి ప్రవేశించింది. సహారా, లిబియాలలో పెద్దఎత్తున నూనె నిల్వలు బయల్పడ్డాయి.

ఆఫ్రికా, అమెరికా గుత్తవర్గాలకు సప్లయి చేస్తున్నది ప్రాథమిక సరుకులనేకాదు (వాటిని గుత్తసంస్థలు తమ యుద్ధసన్నాహాలకు వినియోగించుకుంటాయి) డాలర్లు కూడా సంపాదించిపెడుతోంది. ఈనాడు ఆఫ్రికాలోని అమెరికా గుత్త వ్యాపార సంస్థల సాలుసరి లాభాలు 30 శాతం ఉంటుంది లేదా ప్రపంచంలో యింకా ఇతర ప్రాంతంలోనూ అమెరికా పొందే లాభాలకన్నా ఎక్కువగా ఆఫ్రికాలో పొందుతోంది. ఈ అపార లాభాలన్నీ ఆఫ్రికా కార్మికుల్ని ఘోరంగా దోపిడీ చేయడంవల్ల లభించినవే.

తన వ్యాపారానికి అమెరికా ఆఫ్రికాదేశాల్ని మార్కెట్టుగా ఉపయోగించుకుంటోంది 1940 – 1958 సంవత్సరాల మధ్య ఆఫ్రికాఖండంలో అమెరికా వ్యాపార కార్య

కలాపాలు 5.5 రెట్లు పెరిగాయి. ఈ మొత్తం విలువ 100 కోట్ల డాలర్లు వుంటుంది. ఇప్పటికి మొత్తం ఆఫ్రికా విదేశ వ్యాపారంలో 10 శాతం అమెరికా గుత్త సంస్థలతోనే సాగుతోంది. పైన తెల్పిన "పరస్పర భద్రతా౦ ధకం" ప్రకారం "అమెరికా సరుకులకు మార్కెట్లుగానూ, ముడిసరకులు దొరికే ప్రాంతాలుగానూ సంపదవంతమయిన అనేక దేశాలున్నాయి". ఈ వాక్యంవల్ల అమెరికాకు ఆఫ్రికాలోవున్న ఆర్థిక ప్రయోజనాలు ఎటువంటివో బోధపడుతుంది. ముడిసరుకుల సప్లయి విషయంలోనూ, అమెరికా సరకులకు మార్కెట్లు లభ్యమయే విషయంలోనూ ఈనాడు ఆఫ్రికా అమెరికాకు అనువయిన ప్రాంతంగా వుంది. అయితే, ఆఫ్రికా దేశాలకు అమెరికా అందించే 'సహాయం' పెద్ద మొత్తాలలోవున్నా, ఆ సహాయం వల్ల ఇంతవరకూ ఒక్క దేశమైనా అభివృద్ధిచెంది సంపదైశ్వర్యాలతో తులతూగుతోందేమో చెప్పమంటే, ఒక్క నిదర్శనంకూడా మనకు దొరకదు. ఆఫ్రికాకు అమెరికా సహాయం 1956 కు ముందు 7 కోట్ల 38 లక్షల డాలర్లుండగా, 1957–58 ఆర్థిక సంవత్సరంలో అది 9 కోట్ల 80 లక్షల డాలర్లకూ, 1958–59 నాటికి 10 కోట్ల డాలర్లకు పెరిగింది. మరి ఈ మొత్తాలన్నీ ఏమైనట్లు ? ఎందుకు వినియోగింపబడ్డట్లు ?

ఎందుకనంటే, ఈ'సహాయం' ప్రధానంగా ఆఫ్రికాలో అమెరికా రాజకీయ ఎత్తుగడలకూ, కీలక ప్రాంతాల గుత్తాధిపత్యానికీ వినియోగింపబడింది. దురాక్రమణకు ఈ ఖండాన్ని కీలక ప్రాంతంగా మార్చడానికి ఈ ధనం వెచ్చింపబడుతోంది. ఉదాహరణకు 1958–59లో ఆఫ్రికాకు కేటాయించిన 10 కోట్ల

40 లక్షల డాలర్లలోను పరోక్షంగా గాని, ప్రత్యక్షంగా గాని 9 కోట్ల డాలర్లు సైనిక కార్యకలాపాలకై వినియోగించడం జరిగింది. పోతే 1 కోటీ 40 లక్షల డాలర్లు మాత్రమే సాంకేతిక సహాయం రూపంలో అందింది !

పైగా ఆఫ్రికా ఖండానికి అమెరికా యిచ్చే "సహాయం"లో సగానికి పైగా ఉత్తరాఫ్రికా దేశాలకే వెళ్తోంది. ఎందుచేతనంటే ఉత్తర ప్రాంతాలైన మొరాకో, లిబియాలలో అమెరికా సైనికస్థావరా లున్నాయి. సహారాకు దక్షిణంగా వున్న ప్రాంతాలకన్నా ఉత్తర ప్రాంతాలకే అమెరికా ఎక్కువ సహాయం చేయడానికి కారణమేమిటి అని ఒకసారి అమెరికా, ఆఫ్రికా వ్యవహారాల సలహా కార్యదర్శి జోసెఫ్ సత్తర్‌సైటోను ప్రశ్నిస్తే, అతను చెప్పిన సమాధానం చూడండి : "ఈ ప్రాంతంలో (ఉత్తర అమెరికాలో) అమెరికాకు ప్రత్యేక రాజకీయ, సైనిక ప్రయోజనా లుండడమే ఇందుకు కారణం".

ఈ విధంగా అమెరికా ఆఫ్రికన్లను కొల్లగొడుతోంది. దోచేస్తోంది. ఆఫ్రికా దేశాలను మారణహోమంలో సమిధలుగా చేయాలని చూస్తోంది. ఆఫ్రికా దేశాలు సంపదవంతమైనవవడంవల్లనే తాము దేశాలను అమెరికా సరుకులకు మార్కెట్లుగానూ, ముడిసరుకులు దొరికే ప్రాంతంగానూ వినియోగించు కుంటున్నామని అమెరికా ప్రభుత్వవర్గాలు ఇతర్లను నమ్మించడానికి ఒక వాదన తెస్తున్నాయి. కాని వాస్తవ పరిస్థితులు యిందుకు భిన్నంగా వున్నాయి. ఏమంటే, తనకు పరిశ్రమలు లేకుండా చేయబడ్డ దేశమూ,

తన కవసరమైన పారిశ్రామిక సరుకులకోసం, అందుకు చెల్లించాల్సిన ధనంకోసమూ ఒకానొక సామ్రాజ్యవాద ప్రభుత్వ దయాదాక్షిణ్యాలపై ఆధారపడాల్సివచ్చిన దేశమూ యేవిధంగా ఆర్థికంగా సంపదవంతమైనదవుతుంది ? ఇది ఏ దేశ చరిత్రలోనూ లేదు. ఇప్పుడిప్పుడే అభివృద్ధి చెందుతున్న జాతీయ పరిశ్రమలు ఇంకా వేళ్ళూనకముందే, అమెరికా సరుకులు ఆ దేశాలకు దిగుమతికావడంవల్ల నలిగిపోతున్నాయి.పారిశ్రామికాభివృద్ధికి ఆటంకం ఏర్పడుతోంది. ఇక ముడిసరుకులను అమెరికా గుత్తవ్యాపారాలు తమ ఇష్టంవచ్చిన తక్కువ ధరలు విధించి గుంజుకు పోతున్నారు. ఇది ఆర్థికంగా ఆఫ్రికా దేశాలకు ఎంతో నష్టదాయకం. ఆర్థికంగానే కాకుండా, రాజకీయంగా కూడా నూతన ఆఫ్రికా దేశాలంటే అమెరికా సామ్రాజ్యవాద రాజకీయ వేత్తలకు పచ్చి వెలక్కాయ మ్రింగినట్లు ఉంది. ఆఫ్రికన్ల ప్రయోజనాలకు, పశ్చిమదేశాల ప్రయోజనాలకు మధ్య అమెరికా ప్రభుత్వం మధ్యేమార్గం అవలంబిస్తున్నట్లూ, ఇదే విధంగా 'తటస్థవిధానం, అనుసరిస్తున్నట్లూ ప్రచారం చేసుకుంటుంది అమెరికా. కాని ఇంతవరకూ యూరప్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఆఫ్రికా ప్రజలు సాగిస్తున్న పోరాట క్లిష్ట దశలలో ఎన్నడూ ఆఫ్రికన్లకు అండగా అమెరికా నిలబడలేదనేది వాస్తవం. ఉదాహరణకు నూతనంగా స్వాతంత్ర్యం పొందిన గినియా రిపబ్లిక్‌కు ఆర్థిక సహాయంచేయడానికి ఫ్రాన్సు నిరాకరించినప్పుడుగాని, ఆకలీ, ఆర్థిక సంక్షోభం ఆ దేశాన్ని వెన్నంటినప్పుడుగాని అమెరికా ఇదిగోనని చిల్లి కాని యివ్వకపోయింది. ఇంత సానుభూతైనా కనపర్చలేదు.

చివరకు గినియా రిపబ్లిక్ కష్టదశనుండి తేరుకోడానికి సాయ పడింది సోవియటు యూనియన్, తదితర సోషలిస్టు దేశాలేనన్న విషయం అందరికీ తెలుసు. అలాగే ఆల్జీరియాలో ఘోర హత్యాకాండను ఆపడానికి అమెరికా ప్రభుత్వం పీసమెత్తు కృషికూడా చేయలేదు. పైగా ఆల్జీరియన్ల ప్రయోజనాలకు వ్యతిరేకంగా వ్యవహరించింది. ఈనాడు ఆల్జీరియాలోని ఫ్రెంచి సైనికులు అమెరికా ఆయుధాలను, అమెరికా విమానాలను ఆల్జీరియన్లను హతమార్చడానికి వినియోగిస్తున్నారు.

ఆఫ్రికా ప్రజలకూ, పశ్చిమయూరప్ దోపిడీ దురాక్ర మణదార్లకూ మధ్య తలెత్తే వివాదాలలో జోక్యం కల్పించు కునే విషయంలో అమెరికా కేవలం, వలసవాదులకు అండగా నిలబడ్డంతోనే ఆగదు; అటువంటి వివాదాలను అవకాశంగా తీసుకొని ఆఫ్రికాలో తన స్వప్రయోజనాల్ని కాపాడుకోడానికి ప్రయత్నిస్తోంది. ఈ సందర్భంలో ఇటీవలి కాంగో ఘటన లను ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు. మొదట్లో అమెరికా బెల్జియం దురాక్రమణదార్లను రహస్యంగా బలపర్చింది. ఆ తరువాత కాంగోలో వలసవిధానాన్ని పునః స్థాపించడానికి ఉద్దేశింపబడ్డ చర్యలన్నింటిలోనూ అమెరికా బహిరంగంగానే బెల్జియం సామ్రాజ్యవాదులతో చేతులు కలిపింది. వీటన్నింటికీ మించి అమెరికా తన చర్యలకు ఐ రా స ను ఒక వేదికగా ఉపయోగించుకుంటుంది. ఐ రా స యంత్రాంగం ఈనాడు ఎక్కువభాగం అమెరికా విదేశాంగ శాఖ ఎలా చెబితే అలా నడిచేంత పరాధీన స్థితికి దిగజారింది. ఇటీవల ఐ రా స సర్వసభ్యసమావేశంలో ఆసియా – ఆఫ్రికా దేశాల

అధిపతులు ఇదే విషయాన్ని వ్యక్తంచేశారు. ఐ రా స పున ర్వ్యవస్థీకరణను చివరకు ఐ రా స కార్యదర్శి హామర్షెల్డ్ సహితం వలసవాదులకు అండగా నిలబడ్డాను.

గతంలో ఐరోపాను స్వాహా చేసుకోడానికి "జీయస్" మారురూపం ఎత్తాడు! అలాగే నేడు ఆఫ్రికాను స్వాహా చేయడా నికి అమెరికావ్యాపారవర్గ మొగల్ పాదుషాలు తాము ఆఫ్రికా స్నేహితులమని, ధర్మకర్తలమని దొంగనాటక మాడుతున్నారు. కాని ఎన్ని ముసుగులేసుకున్నా అసలు స్వరూపం ఎక్కడికి పోతుంది ? అమెరికా సామ్రాజ్యవాదం, ఈనాడు సంపూర్ణ విముక్తికై ద్విగుణీకృతోత్సాహంతో పోరాడుతున్న ఆఫ్రికా ప్రజలకు పరమశత్రువు.

## ఆఫ్రికా _ సోషలిస్టు దేశాల సహకారం

సామ్రాజ్యవాదం వలసవిధాన పతాకచ్ఛాయలక్రింద వుంచి, దాదాపు ఇటీవలివరకూ వారి పలుకుబడి క్రింద వున్న ఆఫ్రికా దేశాలతో సోవియట్ యూనియన్‌కూ, తదితర సోష లిస్టు దేశాలకూ అంతత్వరగా సంబంధా లేర్పడ్డం కష్టమైన పనైంది. ఎటుతిరిగీ ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం ఆఫ్రికా దేశాలు విముక్తి పథంవైపు పురోగమిస్తున్న తరువాత, స్వాతంత్ర దేశాలు ఆవిర్భవించిన తరువాతనే ఇప్పుడిప్పుడే ఆ దేశాలకూ, సోషలిస్టు దేశాలకూ సంబంధాలు ఎక్కువవు తున్నాయి.

వలసవాదుల రాజకీయ బానిసత్వంనుండి విముక్తిపొంది, ఆర్థిక స్వాతంత్ర్య సాధనకై కూడా పోరాడుతున్న ప్రజలకు

షరతులులేని సహాయం చేయడాన్ని సోషలిస్టు దేశాలు తమ అంతర్జాతీయ విధ్యుక్త ధర్మంగా భావించాయి, భావిస్తున్నాయి. ప్రపంచ పెట్టుబడిదారీ ఆర్థిక విధానంతో సతమతమవుతున్న బడుగుదేశాల అసహాయ పరిస్థితికి స్వస్తి చెప్పడానికి ఈ దేశాలు కృషి చేస్తున్నాయి. దీనికి సహాయం చేయడంకూడా పవిత్ర కర్తవ్యంగా సోషలిస్టుదేశాలు ఎంచుకున్నాయి.

ఈ బడుగుదేశాలు సాధ్యమైనంత త్వరలో స్వశక్తిపై నిలబడి, స్వయంపోషక వ్యవస్థలను అభివృద్ధిచేసుకుందుకు, ఆర్థికంగానూ, సాంకేతికంగానూ బలమైన దేశాలుగా రూపొందాలనీ సోవియట్, తదితర సోషలిస్టు దేశాలూ కోరుకుంటున్నాయి. ఫలితంగా యీ దేశాలు యేవిధమైన సామ్రాజ్యవాద వత్తిడిగాని, జోక్యంగాని లేకుండానే తమ భవిష్యత్తును తీర్చి దిద్దుకోగలుగుతాయి. ఇందువల్ల అంతర్జాతీయ రంగంలో శాంతిమండలం విస్తరించి, శాంతిశక్తుల అభివృద్ధికి ఇతోధిక సహాయం లభిస్తుంది. యుద్ధం రాకుండా నివారించడానికి అది యెంతగానో దోహదం చేస్తుంది.

ఈనాడు ఐక్య అరబ్ రిపబ్లిక్‌కు చెందిన ఈజిప్టు ప్రాంతంలో పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాలను అమలు పర్చడంలో సోవియట్ అందిస్తున్న ఋణాలు ముఖ్యపాత్ర వహిస్తున్నాయి. ఈ ఋణాలక్రింద సోవియట్ యూనియన్ అందజేసిన యంత్రాలూ, తదితర పరికరాలూ ప్రధానంగా గనుల, నూనె, లోహ, ఇంజనీరింగ్, విద్యుత్ పరికరాల ఉత్పత్తి, రసాయనిక, మందుల, జౌళి పరిశ్రమల అభివృద్ధికి

వినియోగింపబడుతున్నాయి. పోతే అరబ్ రిపబ్లిక్ లోని సిరియా ప్రాంతంలో, బ్రహ్మాండమైన జలవిద్యుత్ కర్మాగారాల నిర్మాణంలోను, రైల్వేల అభివృద్ధికీ, రసాయనిక ఎరువుల పరిశ్రమ నిర్మాణంలోనూ సోవియట్ నిపుణులు సాయం చేస్తున్నారు. సోవియట్ నిపుణుల సాయంతో గొప్ప అశ్వాన్ డాం నిర్మింపబడుతోంది. ఇది ఈజిప్టు ప్రాంత వ్యవసాయాభివృద్ధికి, యావత్తు ఆర్థికరంగం పటిష్ఠవంతం కావడానికీ ఎంతో తోడ్పడుతోంది. మొదట్లో పశ్చిమదేశాలు ఈ డాం నిర్మాణ ఖర్చును చాల ఎక్కువగా అంచనా వేశారు. కాని సోవియటు నిపుణులు దానిని పునఃరచించి డాం మొదటిభాగపు నిర్మాణ ఖర్చును 15 శాతానికి తగ్గించారు.

ఇథియోపియా, గినియాలతో సోవియటు ఆర్థిక ఒడంబడికలు చేసుకున్నది. ఆసియా, ఆఫ్రికాలలో సోవియట్, తదితర సోషలిస్టు దేశాల సాయంతో అనేక పరిశ్రమలు నిర్మింపబడుతున్నాయి. సోవియట్ ఆర్థిక సహాయక కార్యక్రమం కేవలం అప్పులివ్వడానికీ, సాంకేతిక సహాయం అందివ్వడానికీ పరిమితం కాలేదు. సోషలిస్టు దేశాలతో సమాన ప్రాతిపదికపై పరస్పరం లాభదాయకమైన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడమనేది బడుగు దేశాల జాతీయ ఆర్థికరంగానికెంతో అవసరం. ఏమంటే బడుగుదేశాల్లో చాల దేశాలకు, వలసవిధాన దోపిడీ ఫలితంగా ఏకపక్ష ఆర్థికవిధానం, అంటే ఒక పంటను మాత్రమే అభివృద్ధిచేయటమో లేక ఏదో ఒక ముడిసరుకును మాత్రమే ఉత్పత్తిచేయడమనే పద్ధతి సంక్రమించింది. అందువల్ల ఈ దేశాలకు ఎగుమతులనేవి ప్రధాన సమస్యగా తయారైౖ

కూర్చుంది. స్వదేశంలో పండే సరుకులకు ఖచ్చితమైన నిలకడైన గ్యారంటీవుండే మార్కెట్లు ఏర్పరచాలంటే సోషలిస్టు దేశాలతో ఇవి దీర్ఘకాలిక వర్తక ఒడంబడికలు కుదుర్చుకోవడం అవసరం. ఈ అవసరాన్నిప్పుడు ఆఫ్రికా దేశాలు గుర్తిస్తున్నాయి. సోవియట్ ప్రతిపాదించిన అరమరికలు లేని నిరాయుధీకరణ ప్రతిపాదనలను అంగీకరించి, సర్వేలూ ఆయుధవిసర్జన చేస్తే ఆఫ్రికా దేశాలకూ, తదితర బడుగు దేశాల అభివృద్ధికీ ఎంతగానైనా సహాయం చేయడానికి అవకాశం వుంది.



# స్వతంత్ర, అస్వతంత్ర ఆఫ్రికా దేశాలు

(స్థూలమైన వివరాలు)

ఇంతవరకూ స్వాతంత్ర్యం పొందిన, ఇక పొందనున్న ఆఫ్రికాదేశాలకు సంబంధించిన ప్రధానమైన విశేషాలను ఈ క్రింద పొందుపరుస్తున్నాను.

**ఈజిప్టు :** అధ్యక్షులు : గమాల్ అబ్దుల్ నాజర్ (ఐక్య అరబ్ రిపబ్లిక్); రాజధాని : కైరో; వైశాల్యం : 3 లక్షల 86 వేల 198 చదరపు మైళ్ళు, జనాభా : 2 కోట్ల 50 లక్షలు.



నాజర్

ఈజిప్టు, 5 వేల సంవత్సరాల ఉజ్వల నాగరికత ఉన్న దేశం ఈజిప్టు ప్రాచీన నాగరికత జీవనదియైన నైలునదికి ఇరువైపులా ప్రబలింది. బ్రిటిష్ ఆక్రమణ నుండి 1922 లో స్వతంత్రమైంది.

లంచగొండితనానికి పేరుమోసినఫరూక్ రాజు నిరంకుశత్వాన్ని కూలద్రోయడంతో, ఈజిప్టులో రాచరికం 1953 జూన్ 18 తో రద్దయింది. సంపూర్ణ ప్రజాస్వామిక (రిపబ్లిక్) రాజ్యంగా ప్రకటించారు. 1956 జూన్ 23 న నూతన రాజ్యాంగ చట్టంపై జనవాక్య సేకరణ, 1957 జూన్‌లో ఎన్నికలు; బ్రహ్మాండమైన అశ్వాన్‌డాం నిర్మాణాన్ని తలపెట్టి, అందుకయే ఖర్చుకు సూయజ్ కాలువను జాతీయం చేయడంద్వారా, ఆ కాలువ కంపెనీ సంపాదించే విశేషలాభాల్ని వినియోగించాలని నాసర్ నిర్ణయించి, 1956 జూలై 26 న సూయజ్ కాల్వను జాతీయం చేశారు. ఇందుకు మితిమీరిన లాభాలు గుంజుకుపోవడం మరిగిన బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఈజిప్టుపై దాడిచేస్తూ 1956 నవంబరు 5 న యుద్ధాన్ని ప్రకటించాయి. కాని ఈజిప్టు ప్రజల దృఢదీక్షా, సమైక్య పోరాటం వల్ల ఈజిప్టుకు అండగా యుద్ధంలోకి దిగడానికి తాను సిద్ధంగా వున్నానని సోవియట్ యూనియన్ ప్రకటించగానే సామ్రాజ్యవాదులు వెనుకంజవేశారు. అశ్వాన్ డాంకు అమెరికాగాని, బ్రిటిషు, ఫ్రెంచి ప్రభుత్వాలుగాని ఆర్థిక సహాయం చేయ నిరాకరించినప్పుడు సోవియట్ ముందు కొచ్చి ఆ బృహత్తర నిర్మాణానికి సహాయం అందజేసింది. 1958 సెప్టెంబరులో యీ ఆనకట్టకై సుమారు 45 కోట్ల రూపాయల ఋణాన్ని సోవియట్ ప్రకటించింది. నిపుణులను యిచ్చింది. ఈ ఆనకట్ట 20 లక్షల ఎకరాలకు అదనంగా నీరు సరఫరా చేస్తుంది. ఈజిప్టు పరిశ్రమలన్నింటికీ విద్యుచ్ఛక్తి దీనిద్వారా లభ్యమవుతుంది. ఆనకట్ట ఎత్తు 330 అడుగులు.

1958 ఫిబ్రవరి 1 వ తేదీన ఈజిప్టు, సిరియా దేశాలు కలసి ఐక్య అరబ్ రిపబ్లిక్‌గా రూపొందాయి. దానికి నాజర్ అధ్యక్షులు కాగా, ఉపాధ్యక్షులు సిరియా అధ్యక్షుడైన కువాట్లీ. తరువాత ఎమెన్ దేశంకూడా రిపబ్లిక్‌లో చేరింది. ఇప్పుడీ మూడు ప్రాంతాలు కలిసిన ఐక్య అరబ్ రిపబ్లిక్ మొత్తం జనాభా 3 కోట్ల 24 లక్షల 25 వేలు. అంటే దాదాపు మన ఆంధ్రప్రదేశ్ జనాభా అంతన్నమాట. ఈజిప్టులో నాసర్ కమ్యూనిస్టులు, తదితర ప్రజాతంత్ర శక్తులపై నిర్బంధ విధానం అమలు జరుపుతున్నారు.

ఇథియోపియా : పాలకుడు : చక్రవర్తి హైలీ సెలాసీ. రాజధాని: అడిస్ అబాబా; వైశాల్యం: 3 లక్షల 59 వేల చదరపు మైళ్ళు; జనాభా: 2 కోట్లు.



ఇథియోపియా

స్వతంత్ర ఆఫ్రికా దేశాలలో కల్లా చాల పురాతనమైనది. క్రీ॥పూ॥ 200 నుండి రాచరిక పాలన అమలులో వుంది. యుద్ధకాలంలో ఇటలీ ఆక్రమణ క్రిందకు వచ్చింది. 1955 లో చక్రవర్తి నూతన రాజ్యాంగాన్ని ప్రకటించారు. ఇందులో, ప్రతినిధుల సభకు "సార్వజనీన, ప్రత్యక్ష, రహస్య ఎన్నికలు జరగాలని" నిర్దేశింపబడివుంది.

సెనేటును యిప్పటికీ చక్రవర్తి యెన్నుకుంటాడు. నూతన రాజ్యాంగాన్ని అనుసరించి ఇథియోపియాలో ప్రప్రథమంగా 1957 సెప్టెంబర్ 11, అక్టోబర్ 20 తేదీన ఎన్నికలు జరిగాయి. దేశ జనాభా అనేక తెగల క్రింద విభజింపబడివుంది. అన్నింటి లోకి పెద్ద తెగ "అమ్హారాలు". దేశజనాభాలో వీరు మూడింట ఒకవంతు వున్నారు. జనాభాలో 5 శాతం మాత్రమే చదవనూ, వ్రాయనూ నేర్చినవారు. 21 ఏండ్లు వచ్చిన ప్రతి పౌరుడికి ఓటు హక్కు వుంది. ఇథియోపియాలో రాజకీయ పార్టీలు లేవు. ఏ వ్యక్తైనాసరే స్వతంత్రించి అభ్యర్థిగా నిలబడవచ్చు. వయస్సు 25 ఏండ్లు వుంటే చాలు. ఇథియోపియా విదేశ ప్రణాళికానుసారం శాంతియుత దేశాంగ విధానాన్నే అనుసరిస్తోంది. అన్ని దేశాలతోనూ స్నేహ, సహకార సంబంధాలు కలిగివుంది. ఇథియోపియాలోని మస్సావా రేవును తమ యుద్ధనౌకలకు ఉపయోగించుకునేందుకూ, ఒక విమాన స్థావరాన్ని యేర్పాటు చేసుకునేందుకు అమెరికా ప్రభుత్వం వెలిబుచ్చిన కోర్కెను చక్రవర్తీ, ఆయన మంత్రివర్గమూ తిరస్కరించారు.

కాఫీ పంటకు ఇథియోపియా పెట్టిందిపేరు. విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించే వనర్లలో యిదొకటి.

"ఎరిత్రియా" అనే ప్రాంతం ఎర్రసముద్ర పశ్చిమతీరాన్ని ఆనుకుని ఉంది. ఇది ఇటలీ మాజీ వలస. 1895 లో ఇటలీ ఇథియోపియాపై వలసయుద్ధం ప్రారంభించింది కాని, ఓడిపోయింది. ముస్సోలినీ నియంతగా అధికారంలోకి వచ్చిన తరువాత, ఎరిత్రియాను కీలకప్రాంతంగా చేసుకుని ఇథియోపియాపై

దాడి వెడలి, దానిని ఆక్రమించుకునేందుకు వలస పెత్తందార్లు తీవ్ర యత్నాలు చేశారు. సైనిక స్థావరాలు ఏర్పరచారు. ఇథియోపియా సరిహద్దుల వరకు రోడ్లు వేశారు. 1935 నాటికి ఇటలీ వలస సామ్రాజ్యవాదులు యుద్ధానికిసిద్ధమైనారు. ఇటలీ-ఇథియోపియాల యుద్ధం ప్రారంభమైంది. ఈసారి ఇథియోపియా ప్రజలు ఎంతవీరోచితంగా పోరాడినా, దేశంబానిసత్వం లోకి నెట్టబడింది. అయితే ఇటలీ పాలనమాత్రం ఎక్కువ రోజులు సాగలేదు. 1941 లో ఇథియోపియా గెరిల్లాలు ఇటలీ వాళ్ళను ఇథియోపియా, ఎరిటియాల నుండి తరిమివేశారు. 1952 లో ఎరిట్రియా ఇథియోపియాలో, స్వపరిపాలనాప్రాంతంగావిలీనమైంది. ఎరిట్రియా జనాభా 10లక్షలు. 1952 లో తుదిరూపం పొందిన ఎరిట్రియా రాజ్యాంగం ఎరిట్రియాకు శాసనసభను ఏర్పాటు చేసింది. ప్రస్తుతం దేశం లోని నూనెసరఫరా అంతావిదేశీ గుత్తవర్గాల చేతులద్వారానే సాగుతోంది. బ్రిటిషు షెల్ కంపెనీ, ఇటలీ "అజిప్" కంపెనీలు పెట్రోల్ ధరలను పెంచేశారు.

లైబీరియా : అధ్యక్షుడు : వి. ఎస్. టబ్‌మాన్. రాజధాని : మన్రోవియా; వైశాల్యం : 43 వేల చదరపు మైళ్ళు; జనాభా : 15 లక్షలు. స్వతంత్ర దేశం. అమెరికాలోని బానిసబంధనాలనుండి విముక్తులైన నీగ్రోలకు 1847 లో లైబీరియా స్వర్గతుల్యమైంది.


టబ్‌మాన్

లిబియా : పాలకుడు : రాజు. మహ్మద్ ఇద్రిస్ సెనుస్సీ; రాజధాని : ట్రిపోలీ;

వైశాల్యం : 17 లక్షల 60 వేల చదరపు మైళ్ళు. జనాభా : 12 లక్షలు. ఇటలీ మాజీవలస. ఇటలీ దేశానికి అయిదు రెట్లుంది. యుద్ధానంతరం బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల ఆక్రమణ క్రిందకు వచ్చింది. ఐ. రా. స. నిర్ణయానుసారం 1951 లో లిబియాకు స్వాతంత్ర్యం లభించింది. యుద్ధకాలంలో అమెరికన్ సామ్రాజ్యవాదులు కూడా లిబియాలో విమాన స్థావరం ఏర్పర్చుకున్నారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా లిబియా నుండి అమెరికా, బ్రిటిషు సైనికులు వైదొలగ లేదు. లిబియాలో కొంత ప్రాంతాన్ని విమాన స్థావరం ఏర్పాటు చేసుకోడానికి 20 సంవత్సరాలపాటు కౌలుకి తీసుకుంటూ, 1954 లో అమెరికా ప్రభుత్వం లిబియాతో ఒప్పందం కుదుర్చుకుంది. ఫలితంగా "మెల్హా" అనే చిన్న పట్టణం సమీపంలో వుండే తమ పొలాలను 1400 అరబ్ కుటుంబాలు విడిచి వెళ్ళిపోవాల్సిన దుర్గతి పట్టింది. ఈ సైనిక విమాన స్థావరం పశ్చిమ దేశాల సామ్రాజ్యవాదులకు చాల కీలకమైనది. ఇటీవల "మటాడర్" అనే రాకెట్లు ఇక్కడనుండే ప్రయోగించబడ్డాయి. ఇటలీ, పశ్చిమ జర్మనీ, తదితర దేశాలలో తిష్ట వేసిన అమెరికా వైమానికులు బాంబులు వేయడంలో తరిఫీదు ఇచ్చేందుకు లిబియా వస్తూ పోతూవుంటారు.

లిబియా బాగా వెనుకబడ్డ వ్యావసాయిక దేశం. జనాభాలో 80 శాతం రైతాంగ పరిజలున్నారు. నూటికి 94 గురు నిరక్షరాస్యులు. ప్రాచీన రోం నగరానికి ధాన్యాగారంగావున్న లిబియా నేడొక ఎడారి ! సాగుకు లాయకైన 17 కోట్ల 60 లక్షల హెక్టార్ల (హెక్టారు సుమారు $2\frac{1}{2}$ ఎకరాలు)

భూమిలో కేవలం 2 శాతం మాత్రమే ఏదైనా పండించ డానికి వీలుగావుంది. లిబియా వ్యవసాయ రంగంలో ఇటలీ నుండి వచ్చి స్థిరపడిపోయిన పౌరులు ప్రధాన పాత్ర వహిస్తున్నారు. ట్రిపోలిటానియాలోనే వీరు 45 వేల మందివరకు వున్నారు. ఒకవేళ ఏదైనా భూమిని స్వాధీనం చేసుకుందామా ఇటలీ కింద వీ, ఫాసిస్టు శక్తుల క్రింద నున్న భూమిని తీసుకో వాల్సివస్తోంది. ఈ విధంగా స్థిరనివాస మేర్పర్చుకున్న ఇటలీ వాసులక్రిందనే సాగుకు లాయకైన 2 లక్షల హెక్టర్ల భూమి వుంది. లిబియాలో అపార ఖనిజసంపద వుంది. అమెరికా, బ్రిటిష్, ఫ్రెంచి నూనె గుత్త కంపెనీలకు లిబియా ప్రభుత్వం ఎక్కువ అవకాశాలు కల్పించింది. ఫలితంగా వారు యువ లిబియా భావిని తీర్చిదిద్ది, నూనెసంపదను కాజేయడానికి తీవ్ర యత్నాలు చేస్తున్నారు.

మొరాకో: పాలకుడు: రాజు అయిదవ మహ్మద్; రాజధాని: రాబట్; వైశాల్యం: 1 లక్షా 54 వేల 100 చదరపు మైళ్ళు. జనాభా: 1 కోటిమంది. బ్రిటన్‌కన్నా రెండింతలు పెద్దదేశం. ఫ్రెంచి సామ్రాజ్యవాదుల మాజీ వలస. 1956 లో స్వాతంత్ర్యం లభించింది. ఇంకా సుస్థిరమైన ప్రజాతంత్ర ప్రభుత్వం యేర్పడలేదు.

1912 లో మొరాకోను ఫ్రాన్స్, స్పెయిన్‌లు పంచుకున్నాయి. ఆ తరువాత 44 సంవత్సరాలుగా మొరాకో ప్రజలు నిర్విరామస్వాతంత్ర్యపోరాటం నడిపారు. 1921–24 "రిఫ్" (ఒక ప్రాంతం) తిరుగుబాట్లూ; 1926–33 లో వచ్చిన తిరుగుబాట్లు: 1951–56 నాటి బ్రహ్మాండమైన జాతీయవిముక్తి

ఉద్యమం ఇవన్నీ మొరాకో చరిత్రలో సువర్ణ ఘట్టాలు. ఫలితంగా మొరాకాలో ఫ్రెంచి, స్పెయిన్ వలసవాదుల పాలన నశించింది.

దేశంలోకల్లా పెద్ద రాజకీయపార్టీ ఇస్తిక్‌లాల్ (స్వాతంత్ర్య)పార్టీ. మొరాకో కమ్యూనిస్టుపార్టీ. 19 0 లో ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ శాఖగా ఏర్పడింది. 1943 నుండి స్వతంత్ర శాఖగా వ్యవహరిస్తోంది. జాతీయ విముక్తి ఉద్యమంలో పెద్ద కార్మిక సమాఖ్యయైన జాతీయమొరాకో కార్మిక సంఘం ప్రముఖపాత్ర వహించింది.

మొరాకోలో సంపూర్ణ రాచరికపాలన అమలులో వుంది. వలసవ్యవస్థ పుణ్యమా అంటూ తనకు సంక్రమించిన ఆర్థిక పరాధీన స్థితి నుండి మొరాకో బయటపడాల్సివుంది. అందులోనూ ఇప్పటికే మొరాకో ఆర్థిక వ్యవస్థపై వలసవాదులకు గట్టిపట్టు వున్నందున ఇది మరీ అవసరం. మొరాకో ఫాస్ఫరైట్స్ ఖనిజోత్పత్తిలో ప్రపంచంలో ద్వితీయస్థానం వహిస్తోంది; కోబాల్ట్ ఉత్పత్తిలో మూడో స్థానం; మాంగనీస్ ఉత్పత్తిలో అయిదవస్థానం; సీసం వుత్పత్తిలో ఆరవ స్థానం వహిస్తోంది. ఎక్కువ ఖనిజాలను ఫ్రెంచి గుత్తవ్యాపారులే ఎగుమతి చేసుకుంటున్నారు. మొరాకోలోవున్న అయిదు సైనిక స్థావరాలనూ అమెరికన్ ఉద్యోగులు ఖాళీ చేయవలసిందిగా మొరాకో ప్రభుత్వం డిమాండ్ చేస్తోంది.

ట్యునీషియా: అధ్యక్షుడు: హబీబ్ బోర్గిబా. రాజధాని: ట్యూనిస్; వైశాల్యం: 48,195 చదరపుమైళ్ళు, జనాభా 40 లక్షలు.

సుస్థిర ప్రభుత్వం వుంది. ప్రజాతంత్ర పద్ధతిలో ఎన్నికై నది. ఇటీవలి కాలంలో ఆసియా – ఆఫ్రికా దేశవిధానాలపైపై ఎక్కువ మొగ్గు చూపుతోంది. ఆల్జీరియాకు స్వాతంత్ర్యం లభించాలని కోరుతూంది.

సూడాన్ : అధ్యక్షుడు జనరల్ ఇబ్రహీం అబ్బౌద్; రాజధాని ఖార్టూమ్. వైశాల్యం 9 లక్షల 67 వేల 5 వందల చదరపుమైళ్లు. జనాభా 90 వేల మంది.

బ్రిటిషు – ఈజిప్ట్ సంయుక్త పాలనానంతరం 1956 లో స్వాతంత్ర్యం లభించింది. 1959 జనవరిలో సైనిక పాలన వచ్చింది.

సూడాన్ ఒంటెలకు ప్రసిద్ధి. వీటి సంఖ్య సుమారు 20 లక్షలు వుంటుందని అంచనా. ఎగుమతులలో ఇవి ప్రధానస్థాన మాక్రమిస్తున్నాయి. సాధారణంగా సూడాన్ పౌరులు చాల శుచిగా వుంటారు. అనేక తెగలున్నాయి. జనాభాలో నూటికి 55 మంది అరబిక్ భాష మాట్లాడుతారు.

సూడాన్ జాతీయ విముక్తి ఉద్యమంలో ఓండర్మాన్ అనే పట్టణం ప్రధానపాత్ర వహించింది. ఇది చాల పురాతన నగరం. వ్యవసాయానికి అనువైన ప్రాంతం. పరిశ్రమలు ఇంకా అభివృద్ధికాలేదు. 1950 లో బ్రిటిష్‌వారి ఆధిపత్యం బలహీనపడ నారంభించడంతో ఒక జౌళి పరిశ్రమ మాత్రం వెలిసింది. ఇదిగాక సిమెంటు ఫ్యాక్టరీ ఒకటిమాత్రమే దేశంలో వుంది. మిగతావన్నీ ఫ్యాక్టరీలని చెప్పుకోడానికి కూడా వీలులేనివి !

*   *   *

ఘనా : ఇటీవలనే రిపబ్లిక్‌గా ఏర్పడింది. అధ్యక్షులు : డాక్టర్ న్క్రుమా. రాజధాని : అక్రా; వైశాల్యం : 92 వేల చదరపు మైళ్ళు ; జనాభా 67 లక్షలు.



సు క్రు మా

కన్వెన్షన్ పీపుల్స్ పార్టీ ఆరుసంవత్సరాలపాటు నిరంతరం వలస వ్యతిరేక పోరాటం నడిపిన తరువాత, 1957 లో ఘనా విముక్తి పొందింది. ఈ సంవత్సరం జూలై 1వ తేదీన ఘనా కామన్వెల్తులో భాగంగానే రిపబ్లిక్‌గా రూపొందింది. సమైక్య ఆఫ్రికా ప్రయోజనాల దృష్ట్యా ఘనా సార్వభౌమాధికారాన్ని సహితం పణంగా పెట్టగలనని డాక్టర్ న్క్రుమా స్పష్టం చేశారు.

ఘనాను గోల్డ్‌కోస్ట్ అనికూడా వ్యవహరించేవారు. ఈ గోల్డ్‌కోస్ట్ పశ్చిమాఫ్రికాలోని గినియా సింధుశాఖలో వుంది. ఆఫ్రికాలోని అనేక జాతులవారీ ప్రాంతంలో నివసిస్తున్నారు (అషాంతి, ఈవీ, ఫాంతీ, తదితర్లు). వీరి ప్రధాన వృత్తి వ్యవసాయం. పరిశ్రమల్లో పనిచేసేవారు నూటికి ఆరుగురుకంటె యెక్కువమంది లేరు.

ప్రస్తుత ఘనా (గోల్డుకోస్ట్) భూభాగంలో అంతర్భాగంగా వున్న 9 – 13 వ శతాబ్దంనాటి తెగలు క్రమేణా పురాతన ఆఫ్రికా రాజ్యమైన ఘనాలో కలసిపోయాయి. ఈ ఘనా, సెనిగాల్, నైగర్ నదీప్రాంతంలో వుండేది. అషాంతీరాష్ట్రం 17, 18 శతాబ్దాలలో ఘనాలో అంతర్భాగంగా రూపొందింది. దీనికి నాయకుడుగా రాజు వుండేవాడు.

15 వ శతాబ్దంలో పోర్చుగీసు వర్తకులు ఘనా భూ భాగంపై కాలుపెట్టారు. బంగారాన్ని కనుగొన్నారిక్కడ. అందుకనే వీరు ఈ వసల ప్రాంతానికి గోల్డ్ (బంగారం) కోస్ట్ అని పేరు పెట్టారు. ఆ తర్వాత 18 వ శతాబ్దంలో బ్రిటిష్ వాళ్లు ఈ ప్రాంతంపైకి దాడి వచ్చారు. కాని వీరికి ప్రజాప్రతిఘటన తీవ్రస్థాయిలో ఎదురైంది. ఫలితంగా బ్రిటిష్ వాళ్ళీ ప్రాంతాన్ని ఆక్రమించుకోడానికి యీ శతాబ్దారంభంలో కాని సాధ్యం కాలేదు.

## ప్రధాన పంటలు

మొదటినుండి ఘనాలో కోకో ప్రధాన పంటగా వుంది. ప్రపంచంలో ఉత్పత్తయ్యే కోకోలో మూడవవ తు ఇక్కడనే ఉత్పత్తి అవుతోంది. ద్వితీయ ప్రపంచయుద్ధానంతరం కోకో ఉత్పత్తిలో అధికభాగం అమెరికాకు తరలించబడుతుండేది. ఫలితంగా బ్రిటిష్ వాళ్ళు అధికలాభాలు సంపాదించారు. కోకో కొనుగోలు ప్రధానంగా బ్రిటిష్ కంపెనీయైన యునైటెడ్ ఆఫ్రికా కంపెనీపైన ఆధారపడివుంది. దేశంలో మాంగనీసు, బాక్సైట్ ఖనిజాలు ప్రధానంగా లభిస్తాయి.

ఇట్టి సంపదనంతమైన ప్రాంతాన్ని క్రమేణా బ్రిటిషు వాళ్లు తమ వలసగా మార్చుకుని, ఆర్థిక దోపిడీ సాగించడం మొదలుపెట్టారు. అంతేకాదు, రక్షిత ప్రాంతాలుగా వున్న ఘనాలోని ఆషాంతీ, ఉత్తర భూభాగాల్ని కూడ వీరు తెగ దోచుకున్నారు. పైగా ధర్మకర్తృత్వ ప్రాంతంగా ఉంటూ వచ్చిన టోగోలాండ్‌లోని కొంత భాగాన్నికూడ బ్రిటిషువారు ఘనాలో కలుపుకున్నారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం కార్మిక సంఘాలు వెలిశాయి. వీటన్నిటిలోకీ శక్తివంతమైన సంఘం ఘనా గని కార్మికుల సంఘం. దీనిలో 40 వేలమంది సభ్యులుగా వున్నారు. ఇదిలావుండగా మరోవైపున జాతీయ బూర్జువావర్గం పలుకు బడి కూడా హెచ్చునారంభించింది. 1947 లో ప్రస్తుత అధ్యక్షులు డాక్టరు న్క్రుమా నాయకత్వాన యునైటెడ్ గోల్డ్‌కోస్ట్ కన్వెన్షన్ అనే మొట్టమొదటి రాజకీయసంస్థ యేర్పడింది. 1948 ఫిబ్రవరి ఆ ప్రాంతంలో బ్రిటిష్ వస్తువుల బహిష్కరణోద్యమం దేశ మంతటా ఉవ్వెత్తున ఆరంభమైంది. ఇది నాలుగు నెలలపాటు సాగింది. ఆ సందర్భంలోనే ఘనా గవర్నర్ రాజధాని నగర మైన అక్రాలో ప్రదర్శకులపై కాల్పులు సాగించాడు. ఫలి తంగా 29 మంది చనిపోయారు: వేలాది ప్రజలు గాయపడ్డారు. న్క్రుమా, తదితర నాయకుల్ని బ్రిటిష్ ముష్కరులు జైళ్ళలో నిర్బంధించారు. కన్వెన్షన్ పార్టీ నాయకత్వమంతా జాతీయబూర్జు వావర్గంనుండి వచ్చినవారే. దేశస్వాతంత్ర్యం, అన్ని రకాల జాతి విచక్షణకు స్వస్తి చెప్పాలని యీ పార్టీవారు తమ లక్ష్యా లుగా యెంచుకున్నారు.

## శాసనోల్లంఘనోద్యమం

బ్రిటిష్ రాజనీతికి ఒక చిట్కా వుండనేవుంది. రాజ్యాంగ సంస్కరణల పేరుతో పరిమిత స్వాతంత్ర్యాన్ని యివ్వడం అనేది వారిపుట్టుబుద్ధి. కన్వెన్షన్ పార్టీలోని మిత వాదులు బ్రిటిష్‌వారి ఎత్తులకు మోసపోయారు. ఇది గిట్టని డాక్టర్ న్క్రుమావర్గం అతని నాయకత్వాన గోల్డ్‌కోస్ట్ కన్వెన్షన్‌నుండి విడిపోయి, కన్వెన్షన్ పీపుల్స్‌పార్టీ (సి. పి. పి.)

ఒకదాన్ని స్థాపించారు. ఈ పార్టీలక్ష్యం సంపూర్ణ స్వాతంత్ర్యం; స్వపరిపాలన.

1950 వ సంవత్సరంలో నూతన పార్టీయైన పీపుల్స్ పార్టీ దేశ వ్యాప్తంగా అహింసాయుత శాసనోల్లంఘనోద్యమం నడిపిస్తుంది. ఇది సహించలేని బ్రిటిషువారు దేశంలో 'అత్యవసర పరిస్థితి'ని ప్రకటించారు. ఆవిధంగా రెండు నెలలపాటు ప్రజల్ని భయకంపితుల్ని చేసివేశారు. తిరిగి డాక్టర్ న్క్రుమా, తదితర నాయకుల్ని జైళ్ళలో పెట్టారు.

ఎట్టకేలకు ప్రజాశక్తిడికి తట్టుకోలేక 1951 లో బ్రిటిషు వాళ్లు, ఆఫ్రికన్లు మెజారిటీవున్న ప్రాంతాలతో ఒక ప్రభుత్వాన్ని ఏర్పాచడానికి అంగీకరించారు. తర్వాత ఎన్నికలు జరిగాయి (1954 ఎన్నికలు). ఈ ఎన్నికల్లో 83 సీట్లలోను పీపుల్స్ పార్టీకి 34 సీట్లు లభించాయి. ఈ విషయంతో గంగ వెర్రులెత్తి బ్రిటిష్ వలసపాలకులు విభజించి – పాలించు అనే నీతిని చేపట్టారు. ఘనాలో నివసిస్తున్న తెగల నాయకులకు లంచాలిచ్చి, వారిని ప్రోత్సహించి జాతీయోద్యమానికి వెన్నుపోటు పొడవ తలపెట్టారు. ఫలితంగా ఈ తెగల నాయకులు దేశవిభజన జరిగి తీరాలన్నారు. ఈ సందర్భంలో ఘనా జాతీయోద్యమం ఒక విషమఘట్టంలో చేరుకుంది. అయితే ప్రజా సహకారం పీపుల్స్ పార్టీవైపునే వున్నదన్న సంగతి మరచి పోకూడదు.

ఎన్నికల అనంతరం డాక్టర్ న్క్రుమా ప్రధానిఅయ్యారు. ఆఫ్రికా వలసల్లో ఈ పదవి లభించిన ప్రథమ ఆఫ్రికావాసి

ఈయనే. ఆఫ్రికా ప్రజలందరూ దీని నొక ఘన విజయంగా భావించారు.

డాక్టర్ నుక్రుమా అధికారంలోకి రావడంతోనే కొన్ని ప్రజాహిత కార్యాల్ని చేపట్టారు. నుక్రుమా ప్రభుత్వం నేషనల్ బ్యాంకు నొకదాన్ని నెలకొల్పింది. అలాగే 'కోకో' కొనుబడికిగాను జాతీయ కంపెనీ నొకదాన్ని ఏర్పాటుచేసింది. ఈ కంపెనీ యేర్పడ్డంతో, యింతవరకూ గుత్తాధికారం చలాయిస్తున్న యునైటెడ్ ఆఫ్రికా కంపెనీ అధికారాలు క్షీణించిపోయాయి. క్రమేణా అంతకు ముందు అధికార స్థానాల్లో వున్న బ్రిటిష్ అధికారుల స్థానే, ఆఫ్రికన్ ఉద్యోగులు పదవుల నలంకరించసాగారు. విద్యావిధానాన్ని పెంపొందించేందుకు తగిన శ్రద్ధ వహించిది. నూతన ప్రభుత్వం శాసనసభలకు తమ అభ్యర్థులను యెన్నుకొనే హక్కును ఫ్యూడల్ వర్గాలకు లేకుండా చేసింది. 1956 సంవత్సరంలో సార్వజనీన ఓటింగ్ పద్ధతిపై యెన్నికలు జరిపింది. అఖిల ఆఫ్రికన్ జాతీయ శాసనసభ (ఒకే ఒక సభ)కు జరిగిన యీ ఎన్నికల్లో మొత్తం 104 సీట్లలోను, పీపుల్స్ పార్టీకి 72 సీట్లు లభించాయి. అప్పటినుండి 1957 మార్చి 6 న బ్రిటిష్ కామన్వెల్తులో భాగంగానే ఘనాకి స్వాతంత్ర్యం లభించింది. అప్పుడు గతంలోని గోల్డ్‌కోస్ట్ వలస, అషాంటీ, గోల్డ్‌కోస్ట్ ఉత్తరప్రాంతాలు టోగోలాండ్ ధర్మకర్తృత్వ ప్రాంతాలతో కలసి ప్రస్తుతం "ఘనా"గా రూపొందింది.

గినియా : అధ్యక్షులు ఎం. సికెటూరే; రాజధాని : కోనాక్రీ; వైశాల్యం : 95 వేల చదరపు మైళ్ళు; జనాభా : 30 లక్షలు.



సికెటూరే

1958 లో ఫ్రాన్స అధ్యక్షులూ, నియంత యైన డిగోల్ రూపొందించిన నూతన ఫ్రెంచి రాజ్యాంగాన్ని అవకాసం చేసుకుని, సికెటూరే గినియాను "ఫ్రెంచి సమాఖ్య" నుండి విడుదలచేశారు. ఘనాతో కలసి గినియా సమాఖ్యగా ఏర్పడింది.




గినియా

గినియాలో బహు భాషలు మాట్లాడే తెగలూ, జాతులూ వున్నాయి. రాజధాని కొనాక్రీ, ఆఫ్రికా పశ్చిమ కోస్తాలోని అతి ప్రధానమైన రేవు పట్టణాలలో ఒకటి. జనాభాలో నూటికి 90 మంది గ్రామీణ ప్రాంతాల్లో నివసించే వారే. గినియా తూర్పుభాగంలో ఎక్కువ రైతాంగంప్రజలే. ఫ్రెంచి వలసవాదులు ఇక్కడికి 19వ శతాబ్దంలో ప్రవేశించారు. నైగార్, సెనిగాల్, గాంబియా అనే పెద్ద నదులకు గినియాలోని ఫూతాజాలన్ పర్వతాలు పుట్టినిల్లు. గినియాలోని నదులు ఆ దేశ సంపద. బాక్సైట్ ఖనిజం విస్తారంగా లభ్యమవుతుంది. ఫ్రెంచి, అమెరికన్ గుత్త కంపెనీలు ఖనిజ సంపదను దోచుకుంటున్నాయి. బోక్, ఫ్రియా, కిందియా, దాబోలాలవద్ద యీ ఖనిజం షుమారు 60కోట్ల టన్నుల వరకూ

ుభ్యమవుతుందని అంచనా. గినియాలో బంగారం, వజ్రాలు, కాఫీ, కోకో, పండ్లు వగైరాకూడా దొరుకుతాయి.

1895 వ సంవత్సరానికి ముందు గినియా, ఫ్రెంచి వలసయైన సెనిగాల్‌లో భాగంగా వుండేది. అప్పుడు దానిని ఫ్రెంచి పశ్చిమాఫ్రికాలో "స్వపరిపాలిత వలస"గా మార్చారు. 1900 – 1908 సంవత్సరాల మధ్య, దేశంలో పెద్ద ఎత్తున వలస విధాన వ్యతిరేక తిరుగుబాట్లు వచ్చాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధం ఈ వేడికి ఇంకా ఎసరుపెట్టింది. నెమ్మదిగా గినియా ప్రజలు ఫ్రెంచి సామ్రాజ్య వాదుల్ని తమ దేశంనుడి తరిమి వేశారు.

అధ్యక్షుడు టూరేకు దేశంలో మంచి పలుకుబడివుంది. అనేక త్యాగాలు చేసిన డెమోక్రటిక్ యూనియన్ పార్టీకి నాయకుడు టూరే. టూరే అలసట సొలసట నెరుగని వ్యక్తి. అందుచేతనే అతనిని ఆయన స్నేహితులు "మదపుటేనుగు" అని అంటూవుంటారు!

"బానిసత్వంలో వుండి సంపద కలవాడుగా వుండేకన్నా, స్వేచ్ఛ వున్నచోట దారిద్ర్యం అనుభవించడమే మా కిష్టం" అన్న భావంలో నమ్మకం వున్నవాడు టూరే. టూరే ఘనా–గినియా సమాఖ్య ఒప్పందంపై న్క్రుమాతో కలసి సంతకాలు చేశారు. ఫలితంగా ఘనా ప్రభుత్వం గినియాకు 2 కోట్ల 80 లక్షల డాలర్లు సహాయం అందజేసింది. ఆ తరవాత టూరే సోవియట్, తదితర తూర్పు యూరప్ ప్రజాతంత్ర దేశాలలో పర్యటించి వచ్చారు. సోవియట్, గినియాకు 14 కోట్ల రూబుళ్ళు రుణం యిచ్చింది. చైనా 10 కోట్ల రూబుళ్ళ

సహాయం చేసింది. ఈ మొత్తాన్నీ దీర్ఘకాలిక అప్పులు. పైగా వడ్డీ లేదు.

కామెరూన్స్: ప్రధానమంత్రి: ఎం. ఆహిజో; రాజధాని: యూవుండీ; వైశాల్యం: 1 లక్షా 66 వేల 800 చదరపు మైళ్ళు; జనాభా: 32 లక్షలు.


ఆహిజో

కామెరూన్స్ రిపబ్లిక్కు ఒకటి జర్మన్ కామెరూన్‌లో భాగంగా వుండేది. యుద్ధానంతరం కామెరూన్స్ ఫ్రెంచి, బ్రిటిష్ పాలన క్రింద ఐరాస ధర్మకర్తృత్వ ప్రాంతంగా వుంది. ఫ్రెంచి ఆధీనంలో వున్న కామెరూన్స్ 1960 జనవరి 1న స్వతంత్ర దేశంగా ఏర్పడింది. ఫ్రెంచి ప్రభుత్వానికి అనుకూలుడైన అహిజో అధ్యక్షులుగా వున్నారు.



కామెరూన్స్

కామెరూన్స్‌లో కోకో, కాఫీ, నూనె, బంగారం, అల్యూమినియం లభిస్తుంది. అణుశక్తి పదార్థమైన యురేనియం ఖనిజాలు ఇక్కడ లభ్యమవుతాయి. అయితే ఈ యురేనియం అంతా ఫ్రెంచి, పశ్చిమ జర్మనీ, అమెరికా గుత్త వ్యాపారులకే దక్కుతోంది. ప్రజలు దారిద్ర్యంలోనే వున్నారు. వెట్టిచాకిరీ చేయించేవారు. ధర్మకర్తృత్వపాలన పోకుండా యింకా దోపిడీని కొనసాగించేందుకై ఫ్రెంచి సామ్రాజ్యవాదులు కామెరూన్స్ ప్రజలపై

అనేక ఘోరకృత్యాలు జరిపిన ఘటనలున్నాయి. ప్రజల విముక్తి ఉద్యమాన్ని అణచే ఉద్దేశంతో ఫ్రెంచి వలసదార్లు 1955 లో 1400 మంది వ్యక్తుల్ని తమ పొట్టన పెట్టుకున్నారు. వేలాదిమందిని జైళ్ళలో త్రోశారు. "కామెరూన్స్ ప్రజా సంఘం" ప్రధానపార్టీ.

టోగోలాండ్ : (రిపబ్లిక్) అధ్యక్షుడు : సిల్వానస్ ఒలింపియో. రాజధాని : లోమ్. వైశాల్యం : 20 వేల 500 చదరపు మైళ్ళు. జనాభా : 1½ లక్షలు.


ఒలింపియో

పశ్చిమాఫ్రికాలో చిన్న దేశం టోగోలాండ్. ఫ్రెంచి పాలక్రింద నున్న ఐ. రా. స. ధర్మకర్తృత్వ ప్రాంతం.

ఈ సంవత్సరం ఏప్రిల్ 27 న స్వాతంత్ర్యం పొందింది. టోగోలాండ్‌లో కొంతభాగం ఘనాలో చేరింది.

గతంలో యూరోపియన్ వర్తకుల్ని ఆకర్షించిన పశ్చిమాఫ్రికా భూభాగాలలో టోగోలాండ్ ఒకటి. ఇక్కడినుండి వేలాది బానిసలు ఓడలపై బ్రిటిష్, ఫ్రెంచి, పోర్చుగీస్ బానిస వ్యాపారులకు ఎగుమతి చేయబడ్డారు. వెస్ట్ ఇండీస్‌లోని తోటలలో పనిచేయించడానికి వీరు గొనిపోబడ్డారు. బానిసవ్యాపారం యెప్పుడైతే ఆగిపోయిందో, అప్పుడీ ప్రాంతంలో యూరోపియన్ల ఆసక్తి కొంత తగ్గినా, తిరిగి ముడిసరుకులకోసం వెతుక్కుంటూ 19 వ శతాబ్దపు ఉత్తరార్ధంలో యిక్కడకు అడుగు

పెట్టారు. "టోగో" అంటే "సముద్రాంతర" అని అర్థం. మొదట్లో జర్మనీ వలసగా వుండేది. ప్రథమ ప్రపంచ యుద్ధ సమయంలో యీ దేశం జర్మన్ల పాలనక్రింద యెక్కువకాలం లేదు.టోగోలాండ్‌లోని జర్మన్లపై పశ్చిమానవున్న గోల్డ్ కోస్ట్ (ఘనా)లోని బ్రిటిష్ సేనలూ, తూర్పునవున్న దహోమీలో తిష్టవేసిన ఫ్రెంచి సేనలూ దాడిచేశాయి. కొలదిరోజుల్లో టోగోవారి స్వాధీనమైంది. ఫలితంగా బ్రిటిష్ సామ్రాజ్య వాదులు దేశంలోని ఎక్కువభాగాన్ని స్వాధీనంచేసుకొన్నారు. మిగిలిన భాగం ఫ్రెంచివాళ్ళక్రిందకు వెళ్ళింది. 1919 లో వర్సైల్స్ శాంతిఒప్పందం అనంతరం, టోగోలాండ్ లోని ఆంగ్లో-ఫ్రెంచి ఆక్రమిత భూభాగంగోల్డ్ కోస్ట్ వైపుగా పశ్చిమంగా విస్తరించింది. టోగోలాండ్ విభజన విభజనగానే వుండి పోయింది టోగోలాండ్‌లో బ్రిటన్, ఫ్రాన్స్‌లను మాండేటరీ లుగా స్థిరపరుస్తూ నానాజాతి సమితి నిర్ణయించింది. దానితో దేశంలో చిరకాలంగా వుంటున్న ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్న మైంది. ఆంగ్లో – ఫ్రెంచి వలసదార్ల మధ్య పంపిణీయైన భూభా గాల సరిహద్దువల్ల అటూ యిటూ అనేక గాయాలను తెగ కొట్టింది. ఫలితంగా టోగోలాండ్ లోని ఒక భాగంలో బ్రిటిష్ చట్టాలూ, బ్రిటిష్ నాణాలూ (పౌండ్లు) చెలామణీ అవుతుం డగా, మరోప్రాంతంలో ఫ్రెంచి చట్టాలూ, ఫ్రెంచి ఫ్రాంకులూ అమల్లోకి వచ్చాయి.

1956 లో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల క్రిందనున్న టోగోలాండ్ ప్రాంతం (4 లక్షల 29 వేలమంది జనాభా), గోల్డ్ కోస్ట్ ( ఇప్పటి ఘనా ) వలసలో భాగమైపోయింది.

ఈనా డిది, స్వతంత్ర ఘనా పరిపాలనా ప్రాంతాలైన అయి దింటిలో ఒకటి. పోతే ఫ్రెంచి టోగోలాండ్‌లోని జనాభా సుమారు 10 లక్షలుంటారు.

టోగోలాండ్ వ్యావసాయిక దేశం. ఇక్కడ దాదాపు ఫ్యాక్టరీలుగాని, మిల్లులుగాని, గనులుగానీ లేవు. వ్యవసాయోత్పత్తిలో 100 శాతం ఎగుమతులే. అందులోనూ కాఫీ, కోకో ఎగుమతులే నూటికి 75 వంతులుంటాయి. తగినంత ఆహారోత్పత్తి లేక దిగుమతి చేసుకోవాల్సివస్తోంది. ఫ్రెంచి టోగోలాండ్‌లోని జాతీయవిముక్తి ఉద్యమాన్ని "టోగోలాండ్ యూనిటీ కమిటీ" నడిపింది. ఈ పార్టీ 1946లో ఏర్పడింది. 1958 ప్రారంభంలో సార్వజనీన ఓటింగ్ ప్రాతిపదికపై శాసన సభ ఎన్నికలు జరపడానికి ప్రజావత్తిడివల్ల అధికారులు అంగీకరించక తప్పలేదు. ఇది ప్రజలు సాధించిన ప్రధాన విజయం. ఓటర్లను మాయపుచ్చడంకోసం "ధర్మకర్తలు" ఎన్నికలసమయంలో కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టారు. కాని వలసపాలన అంతర్యాన్ని ఈ పైపై పూత లేమీ మరుగు పర్చలేవు. సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటించితీరాలని గట్టిగా డిమాండ్ చేయడంద్వారానే, దేశంలోని దేశభక్తియుత శక్తులు వలసవాదుల ఎత్తుగడలకు సమాధానం చెప్పగలిగాయి. 1958 ఏప్రియల్ 27న ఎన్నికలు జరిగాయి. టోగోలాండ్ యూనిటీపార్టీ, దాని కార్యచరణ పథకాన్ని బలపరుస్తున్న స్వతంత్ర అభ్యర్థులూ మొత్తం 46 స్థానాలలో 32 స్థానాలు గెల్చుకున్నారు. చివరకు అనేకమంది ఇతర ప్రతిపక్షాల సభ్యులుకూడా తమలో చేరడంవల్ల, యూనిటీపార్టీ మెజారిటీ

పెరిగింది. ఎన్నికల అనంతరం విజయంపొందిన యూనిటీ కమిటీ ఒలింపియో అధ్యక్షతన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది.

కాంగో: (రిపబ్లిక్) ప్రస్తుతం తీవ్రమైన రాజకీయ సంక్షోభంలో చిక్కుకొని వున్న మధ్య ఆఫ్రికా దేశం. అధ్యక్షులు: కసవుబూ; ప్రధాన మంత్రి పాట్రిస్ లుముంబా. రాజధాని లియోపాల్డ్ విల్లీ; వైశాల్యం: 9 లక్షల 4,974 చదరపు మైళ్ళు. జనాభా 1 కోటీ 25 లక్షలు.



లుముంబా

దాదాపు ఏడు దశాబ్దాలుగా బెల్జియం సామ్రాజ్యవాదుల వలసగా వుండి 1960 జూలై 1 న స్వాతంత్ర్యం పొందింది. ప్రస్తుతమున్న ప్రభుత్వం కాంగో 'జాతీయోద్యమ పార్టీకి, కసవుబూ 'అబాకో' పార్టీకి మధ్య కుదిరిన రాజకీయ' ఒప్పందం ఆధారంగా ఏర్పడ్డ మిశ్రమ మంత్రివర్గం. అధికార వ్యామోహంకొద్దీ అధ్యక్షుడు కసవుబూ ప్రవర్తన వల్ల కాంగో జాతీయత అనేక అపాంతరాలను ఎదుర్కోవలసి వచ్చింది ప్రధాని లుముంబా బెల్జియం సామ్రాజ్యవాదులకు ఎంతమాత్రం లొంగకుండా, దేశ స్వాతంత్ర్య పరిరక్షణకోసం నిర్విరామంగా కృషి చేస్తున్నాడు. కాంగోకు స్వాతంత్ర్యం ప్రకటింపబడ్డ కొలది

రోజులకే కాంగో అంతర్భాగమైన కాటంగా రాష్ట్రానికి ముఖ్యమంత్రియైన త్షోంబే, కాటంగా స్వాతంత్ర్యం ప్రకటించి, తానొక ప్రధానినని ప్రకటించుకున్నాడు. దానితో కాంగో రాజకీయాలు తీవ్రరూపం ధరించాయి. చివరకు యెవరు యే ప్రభుత్వాన్ని గుర్తించాలన్న విషయమై సందిగ్ధావస్థ యేర్పడింది. అయితే పాట్రిస్ లుముంబా మంత్రివర్గం (అధ్యక్షులు కసవూబూను మినహాయించగా) దేశ ప్రయోజనాల కనుగుణ్యమైన పాత్రనే నిర్వహిస్తూండడంవల్ల, ప్రపంచంలోని శాంతికాముకులూ, ప్రజాతంత్ర శక్తులన్నీ ఆ ప్రభుత్వాన్నే గుర్తించాయి. త్షోంబే ఆగడాలను కట్టిపెట్టి, దేశంలో కల్లోలాన్ని అణచి, కాటంగా రాష్ట్రాన్ని కాంగో రిపబ్లిక్‌లో అంతర్భాగం చేయడానికి తోడ్పడాలంటూ లుముంబా ప్రభుత్వం చేసుకున్న డిమాండ్‌ను ఐ. రా. స. భద్రతా సంఘం ఆమోదించి, ఐ. రా. స. సైన్యాన్ని కాంగోకు సాయంగా పంపింది. కాని ఆచరణలో అమెరికా పలుకుబడిక్రింద నున్న ఐ. రా. స. సైన్యం ముఖ్యంగా ఉత్తర అట్లాంటిక్ సైనిక కూటమి రాజ్యాలకు చెందిన సేనలు, లుముంబా ప్రభుత్వానికి వ్యతిరేకంగా వ్యవహరించే విద్రోహుల ముఠాలకు పరోక్షంగా తోడ్పడ్డాయి. శాంతిపరిస్థితులేర్పడ్డానికి బదులు అశాంతి యెక్కువైంది. ఎన్నికైన పార్లమెంటు లుముంబా మంత్రివర్గాన్ని బలపరుస్తున్నా, ఐ రా స. మాత్రం యింతవరకూ ఆ ప్రభుత్వానికి ఐ.రా.స.లో స్థానమివ్వలేదు. లుముంబా ప్రభుత్వానికీ, సోవియటుకూ మంచి సంబంధాలున్నాయి.

* * *

కాంగో, ఆఫ్రికాఖండంలో ప్రముఖ నదియైన కాంగో నది, దాని శాఖలూ వ్యాపించియున్న సారవంతమైన ప్రాంతం. ఉష్ణదేశం. ప్రధాన ఉత్పత్తిలో ప్రత్తి, వరి, కాఫీ, దంతం, రబ్బరు, ఖనిజాలు, రాగి, బంగారం, వజ్రాలు, తగరం, యురేనియం. కాంగోను బెల్జియం రాజు రెండో లియోపాల్డ్ చాలకాలంగా పరిపాలిస్తూవచ్చాడు. తరువాత యిక్కడ 1908 లో బెల్జియం ప్రభుత్వాధికారం స్థిరపడింది 1880 లో చుట్టపు చూపుగా వచ్చిన బెల్జియం క్రింద నౌకరీగా చేసిన హెన్రీమోర్టన్‌స్టాన్లీ అనే బ్రిటిష్‌వాడు లియోపాల్డ్‌విల్లీ అనే నగరాన్ని కనుగొన్నాడు. ఇందుకు బెల్జియం రాజైన రెండవ లియోపాల్డుకు స్థానిక తెగలవద్ద తక్కువ ధరలకు పెద్ద పెద్ద భూ ఖండాలను కొనిచ్చాడు తరువాత ఈ నగరం లియోపాల్డ్ పేరిట లియోపాల్డ్‌విల్లీగా మారింది. గుత్తవ్యాపారీ, రాజూ అయిన ఈ లియోపాల్డ్ తన స్వంతసామ్రాజ్యం అన్నట్లు సంపదవంతమైన ఈ ఆఫ్రికన్ వలసనుండి రబ్బరు, దంతాలు, తదితర సంపదను అమ్ముకొనేవాడు. ఈ సంపదకంతా సృష్టికర్తలైన కాంగో శ్రామికవర్గం తమ ఆస్థిని పరాయివారు దోచుకోడానికి వ్యతిరేకించినప్పుడల్లా, రాజు ఏజెంట్లు వారి చేతులు నరికేసేవారు. అందుకనే చరిత్రకారులు "ఈ లియోపాల్డ్ పాలనలో కాంగో జనాభా సగానికిసగం తరిగిపోయింది"ని వ్రాశారంటే అందులో అబద్ధమేమీ లేదు.

ఆ తరువాత కొంతకాలానికి తనకు తగిన సంపదను సృష్టించడం లేదని రాజు కాంగోను బెల్జియం ప్రభుత్వానికి అమ్మేశాడు. అయితే దోపిడీస్వరూపం మారిందేకాని, దాని

స్వభావంమాత్రం మారలేదు. బెల్జియం సామ్రాజ్యవాద పాలకుల హయాములో కాంగో ప్రజల ఇక్కట్లు యింకా ఎక్కువైనాయి.




దాస్య శృంఖలాలలో చిక్కుకున్న కాంగో ప్రజల వ్యతిరేకోద్యమం అనేక దశలు దాటి ఆఫ్రికా దేశీయులకు, తెల్లవారికి మధ్య ఘర్షణలతో 1958 జనవరిలో ఒక పెద్దఉద్యమంగా రూపొందింది. ఆ తరువాత 1959 జనవరిలో మరో ప్రజా

వెల్లువ బెల్జియం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా వెల్లువెత్తింది. అక్కడినుండి కాంగో జాతీయ విముక్తి ఉద్యమం మూడు ప్రాపులూ ఆరు కాయలుగా పరిఢవిల్లుతూ వలస పెత్తందార్లకు పక్కలో బల్లెమై నిలచింది 1959 నాటి తిరుగుబాటులో లియోపాల్డ్‌విల్లీ కార్మికవర్గం ప్రధాన పాత్ర నిర్వహించిందనే చెప్పాలి. ఏమంటె లియోపాల్డ్‌విల్లీ జనాభాలో ¼ వంతు వున్న శ్రామికవర్గం అంటే 90 వేల మంది, రేవు, రైల్వే, నౌకా నిర్మాణ, ఫ్యాక్టరీ కార్మికులున్నారు. ఈవర్గమే పోరాటంలో నిర్ణయాత్మక పాత్ర వహించింది.

## కాంగో కార్మికవర్గం

కాంగోలోని ఆఫ్రికన్ కార్మికుడు నెలకు 500–700 ఫ్రాంకులు సంపాదించుకుంటాడు. ఇందులో 150–200 ఫ్రాంకులు మధ్య లేదా ఒకప్పుడు 350 ఫ్రాంకులు సహితం అద్దె కోసమే చెల్లించుకోవాలి. కట్టుబట్టల ధరలా విపరీతం. ఎంత హీనమైన గుడ్డ అయినా 250 ఫ్రాంకులుంటుంది.

వీటన్నింటికితోడు కార్మికవర్గం, రాజకీయార్థిక స్వాతంత్ర్యంకోసం బలమైన పోరాటం నడపాల్సి వచ్చింది. ఇది గమనించిన వలసాధికారులు కార్మిక సంఘాలపై తీవ్రనిర్బంధ విధానాన్ని అమలు జరిపారు. 1956 వరకు దేశంలోని ట్రేడ్ యూనియన్లు అన్నింటినీ నిషేధించారు. అయితే తరువాత ప్రజాపోరాటంవల్ల, కార్మికులు లేకపోతే యంత్రం నడవదు గాబట్టి, ఈ నిర్బంధ విధానాన్ని కొంత సడలించక తప్పలేదు.

1959 నాటి లియోపాల్డ్‌విల్లీ తిరుగుబాటు దేశంలోని అనేక ప్రాంతాలకు వ్యాప్తిచెందింది. వలసాధికారుల లోభ పాశాలుగాని, వంచనలుగాని, హామీలుగాని విముక్తి ఉద్యమాన్ని నిరోధించలేక పోయాయి. ఒకవైపున రాజు బ్వాడిన్ "కాంగో స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తామని" ప్రకటిస్తూనే వున్నాడు. మరోవైపున వలసాధికారులు ప్రజలపై నిర్బంధ విధానాన్ని అమలు జరుపుతూనే వచ్చారు. 1959 జనవరిలో కాంగో ప్రజల ప్రముఖ జాతీయ సంస్థయైన "అబాకో"ను నిషేధించారు. దాని నాయకులైన కసావుబూ, కంజాలను జైళ్ళలో నిర్బంధించారు. జాతీయోద్యమ నాయకుల్లో ఒకరైన ప్రస్తుత ప్రధానమంత్రి లుముంబాను కూడా అరెస్టు చేశారు.

ఎట్టకేలకు జాతీయ విమోచనోద్యమం బెల్జియం అధికారులను తిరోగమనపథం పట్టించగల శక్తిగా రూపొందింది. కల్లవాళ్ళం చేసే పాడుసూపని వలసశక్తులు గత సంవత్సరాంతంలో కాంగో నాయకులతో కలసి రౌండ్ టేబిల్ సమావేశానికి అంగీకరించక తప్పలేదు. 1960 జనవరిలో బ్రస్సెల్స్‌లో సంప్రతింపులు జరిగాయి. సంస్కరణల పేరుతో కాంగో ప్రజలను మోసగించడానికి ఈ సమావేశంలో బెల్జియన్ అధికారులు ప్రయత్నించారు. కాని కాంగో నాయకులు కనపర్చిన నిశ్చిత వైఖరీ, సమైక్యతా వైఖరీ 1960 జూన్ 30 న కాంగోకి స్వాతంత్ర్య ప్రదానం చేసేటట్లు బెల్జియంను ముక్కుకు తాళ్లు వేసి లాగడానికి తోడ్పడింది.

సోమాలీ : (రిపబ్లిక్) అధ్యక్షులు : అదాన్ అబ్దుల్లా;

రాజధాని : మొగాదిష్యూ; వైశాల్యం : 2 లక్షల 40 వేల చదరపు మైళ్ళు; జనాభా : సుమారు 20 లక్షలు.



సోమాలీ

ఆఫ్రికాలో కల్లా చిన్న స్వాతంత్ర్య రాజ్యమైన సోమాలీ రిపబ్లిక్, మాజీ వలసలయిన ఇటలీ ధర్మకర్తృత్వ ప్రాంతమైన సోమాలీ, బ్రిటిష్ వలసైన సోమాలీ లాండ్‌ల విలీనీకరణతో ఏర్పడింది. ఫ్రెంచి సోమాలీలాండ్‌కు యింకా స్వాతంత్ర్యం లభించాల్సి వుంది.

గత శతాబ్దం ఆఖరిలోనూ, ఈ శతాబ్దం ప్రారంభంలోనూ, ఈ ద్వీపకల్పాన్ని ఫ్రెంచి, బ్రిటిష్, ఇటలీ వలసవాదులు ఆక్రమించి తమలో తాము పంచుకున్నారు. ఈ పంపిణీ ఫలితంగా 13 లక్షల జనాభాగల ప్రాంతం ఇటలీకి వెళ్ళింది. ఇది ఇటలీ తూర్పు ఆఫ్రికాలో ప్రధాన ప్రాంతంగా మారింది. 6 లక్షల 40 వేలమంది జనాభావున్న ప్రాంతం బ్రిటన్‌కు వెళ్ళింది. ఇది తరువాత బ్రిటిష్ వలసయైన కెన్యాలో కలుపబడింది. పోతే ఫ్రాన్స్‌కు 63 వేల జనాభాగల ప్రాంతం ఫ్రాన్స్‌కి వెళ్ళింది.

సోమాలీ అభివృద్ధికై "ధర్మకర్తలు" చేసిందేమీ లేదు. తమ పది సంవత్సరాల పాలనలో వీరు ఒక్క రైల్వే లైనుగాని, ఓడరేవుగాని, ఫ్యాక్టరీ లేదా మిల్లునుగాని నిర్మించలేదు. ఇక్కడ తలసరి ఆదాయం సంవత్సరానికి రు. 100 ల కన్నా తక్కువే. పాఠశాలల కొరతవుంది. కాని ఇటలీ, బ్రిటిష్ గుత్త సంస్థలు విపరీత లాభాలు తీస్తున్నాయి. ఉదాహరణకు ఇటలీ గుత్తసంస్థ ఒకటి నదీలోయ ప్రాంతాలలో సారవంతమైన 48 వేల హెక్టార్ల భూమిలో తోటలు వేసింది. "అభివృద్ధి నిధి" పేరుతో అమెరికా గుత్తసంస్థలు కూడా యిక్కడకు ప్రవేశించాయి. ఈనాడు దేశంలోని వివిధ సంస్థలలోగాని, ప్రభుత్వ శాఖలలోగాని రెండువేలమంది అమెరికన్ వ్యాపార ఏజెంట్లు వున్నారు. 1959 లో ఇటలీ అమెరికాతో కుదుర్చుకున్న రుణ ఒప్పందం యీ చిన్న దేశం ఆర్థికను నులిమివేసే ప్రమాదం వుంది. ఈ ఒప్పందం క్రింద సోమాలీకు 20 లక్షల డాలర్లు (సుమారు 1 కోటి రూపాయలు) అప్పు పేరుతో బలవంతంగా రుద్దారు. ఈ ఒప్పందం అమెరికా "పరస్పర భద్రతా చట్టం" క్రింద కుదుర్చుకోబడింది. అందువల్ల సోమాలీ అమెరికా సైనిక కూటాలలో యిరుక్కునే ప్రమాదం వుంది.

* * *

మాలీ రిపబ్లిక్ : ప్రధానమంత్రి : మోంబో కీటా, రాజధాని : దాకర్; వైశాల్యం : 8 లక్షల 75 వేల చదరపు మైళ్ళు. జనాభా; 61 లక్షల 50 వేలమంది.

ఫ్రెంచి మాజీ వలసలైన సెనిగాల్, సూడానులు మొదట్లో "ఫ్రెంచి సమాఖ్య" లో అంతర్భాగంగానే స్వతంత్ర దేశాలుగా ఏర్పడి 1960 జూలై మొదట్లో మాలీ ఫెడరేషన్‌గా రూపొందాయి. కాని ఫ్రాన్స్‌తో మరింత సన్నిహితంగా వుండే సెనిగాల్ నాయకుల చర్యలవల్ల, వేర్పాటు ధోరణివల్ల, ఫ్రెంచివారి కుట్రవల, ఫెడరేషన్ విచ్ఛిన్నమయింది ఇప్పుడు సెనిగాల్, సూడాన్‌లు ఏ ప్రాంతానికా ప్రాంతం విడిగా స్వాతంత్ర దేశాలుగా వుంటున్నాయి.సూడాన్ మాలీ రిపబ్లిక్‌గా ప్రకటించుకున్నది. సెనిగల్, సూడాన్‌లు యిటీవలనే ఐరాసలో సభ్యత్వం స్వీకరించాయి.

*　　　*　　　*

మలగాసీ : (రిపబ్లిక్), అధ్యక్షుడు : ఫిల్లీబర్ట్ సిరానానా; రాజధాని : తానారివీ; వైశాల్యం : 2 లక్షల 28 వేలు చదరపు మైళ్లు; జనాభా : 51 లక్షల 70 వేలు. దీనినే మడగాస్కర్ అనే వారు. ఇది ఫ్రెంచి మాజీ వలస. 1960 జూన్ 26 న స్వాతంత్ర్యం పొందింద.

మలగాసీలో ఎక్కువమంది ఇప్పటి మలయా, ఇండోనీషియాల నుండి వలసవచ్చినవారే. 1895 లో ఫ్రెంచివారు

దానిని ఆక్రమించుకున్నారు. ఇక్కడ వరి పండుతుంది. పశు సంపద ఎక్కువ. పెద్ద పరిశ్రమలు లేవు. తోటలూ, విదేశీ వ్యాపారం ఎక్కువగా ఫ్రెంచి గుత్త వ్యాపారుల చేతుల్లోనే వున్నాయి.

*　　　　*　　　　*

దహోమీ : ప్రధా : హ్యూబర్ట్ మాగా. రాజధాని: పోర్టోనోవో. వైశాల్యం: 45 వేల 897 చదరపు మైళ్ళు, జనాభా : 17 లక్షలమ ది.



మాగా

ఫ్రెంచి సమాఖ్యలో భాగంగా దహోమీ 1960 ఆగస్టు 1 న స్వాతంత్ర్యం పొందింది.

ఇది ఫ్రెంచి పశ్చిమాఫ్రికాలోని భాగాలన్నింటిలోకీ చిన్నది. గినియా సింధు శాఖ నుండి తోసుకువచ్చిన చిన్న కునియా దహోమీ. ఆలివ్ పంట ఎక్కువ. ఆలివ్ పండ్లు దేశ ఎగుమతులలో ప్రధానస్థాన మాక్రమిస్తున్నాయి. ఉత్తరంగా పోయినకొద్దీ తీపిబంగాళాదుంపలపంట అధికం. ఇంకా ఉత్తరంగా వెళ్ళినకొద్దీ ప్రత్తిపంట, మొక్కజొన్న, సగ్గుబియ్యం ఎక్కువగా పండుతాయి. పరిశ్రమలు బొత్తిగా లేవు. ఇటీవలనే యిక్కడ క్రోమైట్, ఇనుము, మునిఖనిజాలు కనుగొనబడ్డాయి.

రిపబ్లిక్ కు "దహోమీ" అనే పేరు 17–19 శతాబ్దాల మధ్యకాలంలో నెలసిన దహోమీ అనే ఆఫ్రికా రాజ్యంనుండి వచ్చింది. ఆనాటి దహోమీ రాజ్యానికి బలమైన సైన్యం వుండేది. సుస్థిరమైన ప్రభుత్వంవుంది. సైన్యంలో తగినంతమంది మహిళలుకూడా వుండేవారట. 1890 లో దహోమీను ఫ్రెంచి

సైన్యం జనరల్ డాడ్స్ నాయకత్వాన బలవంతంగా ఆక్రమించింది. దహోమీ చివరి రాజైన బెహాన్‌జిన్‌ను దేశంనుండి తరిమివేశారు. ఈ శతాబ్దం మొదట్లోనే ఇది ఫ్రెంచి పశ్చిమాఫ్రికాలోవిలీనం చేయబడింది. 1958 లో దహోమీ వాని బలవంతాన "ఫ్రెంచి సమాఖ్య" (లేదా బ్రిటిష్ కామన్వెల్తులాగా, ఫ్రెంచి కామన్వెల్తు)లో చేర్చారు. అప్పుడది, మాలీ ఫెడరేషన్‌లో చేరింది. కాని వలసవాదుల వత్తిడివల్ల తిరిగి మాలీ ఫెడరేషన్‌నుండి వైదొలగింది 1959 ఏప్రిల్ 23న తుది శాసన సభ ఎన్నికలు జరిగాయి. ఇందులో రిపబ్లికన్‌పార్టీ గెలిచింది. దానికి 28 స్థానాలొచ్చాయి. డెమొక్రటిక్ రాలీ ఆఫ్ దహోమీకి 22 స్థానాలు, డెమొక్రటిక్ యూనియన్‌కు 20స్థానాలూ వచ్చాయి. డెమొక్రటిక్ యూనియన్ నాయకులైన హుబాలుబర్డ్ మాగా నాయకత్వాన ఉన్న ప్రభుత్వంలో పై మూడుపార్టీల ప్రతినిధులూ వున్నారు.

*          *          *

నైగర్ : (రిపబ్లిక్) అధ్యక్షులు : ఎం. హామానీ దియోరీ. రాజధాని: నియామీ. వైశాల్యం: 4 లక్షల 59 వేల చ॥ మైళ్ళు; జనాభా : 24 లక్షలు.


దియోరీ

ఇదికూడా ఫ్రెంచి పశ్చిమాఫ్రికా వలసయే నైగర్‌ను "ఎడారిలోకి చొచ్చుకు వచ్చిన వ్రేలు" అని పిలుస్తూంటారు. ఎందుచేతనంటే నైగర్ ఉత్తర భాగం

సహారా ఎడారి మధ్యకు చొచ్చుకుపోతుంది. పోతే దక్షిణ భాగం పశ్చిమాఫ్రికా మైదానప్రాంతాలకు ఆనుకుని వుంటుంది. జనాభాలో యెక్కువభాగం దక్షిణ నైగర్‌లో నివసిస్తున్నారు. ప్రధాన తెగ హూసా, వాయువ్య నైగర్‌లో దేశద్రిమ్మరులైన కొండజాతులు, "టూరెగ్" తెగలు నివసిస్తున్నాయి. వీరు ఉత్తరాఫ్రికానుండి వచ్చారు. వీరి భాషలో కొన్ని లాటిన్ పదాలుండడం విశేషం. ఉదాహరణకు కొన్ని నెలల పేర్లు చూస్తే, ప్రాచీన రోంనగరంతో వారికున్న సంబంధాలు గుర్తుకొస్తాయి. మతం ఇస్లాం. పర్దా పద్ధతి అమలులో వుంది. ఈ పద్ధతి ననుసరించేది మహిళలు కాదు, పు షులే !

గత శతాబ్దం ఉత్తరార్థభాగంలో నైగర్‌లోకి ఫ్రెంచి వలస పెత్తందార్లు చొచ్చుకువచ్చారు. విపరీతమైన బడుగు స్థితిగల దేశం. పశుపోషణ, పంటలు పండించడం, ప్రధాన వ్యవసాయవృత్తి వేరుశెనగ వారి ముఖ్యమైన పంట. పరిశ్రమలు దాదాపు లేవనే చెప్పవచ్చు. 1958 డిశెంబరు 14 న నైగర్ శాసనసభకు ఎన్నికలు జరిగాయి. ఇందులో బొబూ హామా నాయకత్వానఉన్న ప్రోగ్రెసివ్ పార్టీ గెలిచింది. ఈ పార్టీకి 60 స్థానాలలో 49 స్థానాలు లభించాయి. 1960 ఆగస్టు 3 న స్వాతంత్ర్యం లభించింది.

* * *

ఐవరీకోస్టు: (రిపబ్లిక్): అధ్యక్షులు: ఫెలిక్స్ హౌయిగ్నే, రాజధాని: అబీజాన్; వైశాల్యం: 1 లక్షా 24 వేల 500 చదరపు మైళ్ళు; జనాభా: 26 లక్షలు. 1960 ఆగస్టు 7 న స్వాతంత్ర్యం లభించింది

అర్ధికంగానూ మాజీ ఫ్రెంచి పశ్చిమాఫ్రికాలోకెల్లా బాగా అభివృద్ధి చెందిన ప్రాంతం. ప్రధానమైన ఎగుమతులు కాఫీ, కోకో. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలంలో అమూల్యమైన వజ్రపు నిధులు కనుగొనబడ్డాయి. వాటిని వెలికితీసి శుద్ధిచేస్తున్నది ఫ్రెంచి కంపెనీలు. దేశంలో కలప ప్రధాన పరిశ్రమ. రాజధాని అబీజాన్ సమీపంలో ఫ్రెంచివాళ్ళ యాజమాన్యానగల కాగితపుమిల్లు ఒకటివుంది. 1950 లో దీనిని నిర్మించారు.

ఐవరీకోస్టుకు సుదీర్ఘమైన చరిత్ర వుంది. 11 వ శతాబ్దంలోనే "సీంఫ" తెగవారు ఇక్కడ "కాంగ్" అనే నగరాన్ని కనిపెట్టారు. ఇది ఉత్తరోత్తరా మంచి వ్యాపార కేంద్రంగా అభివృద్ధి చెందింది. పశ్చిమాఫ్రికాలోని యితర ప్రాంతాలకు వలె, ఐవరీకోస్టులో కూడా మొట్టమొదట కాలు పెట్టినవారు పోర్చుగీసులు. 1475 లో ఇక్కడికివచ్చిన లిస్బన్ వానిస వ్యాపారి ఫెర్నాన్ గోమెస్ ఈ దేశానికి "ఐవరీకోస్టు" అని పేరు పెట్టారు. 1637 లో ఫ్రెంచివారు దీనిని ఆక్రమించారు. 1890 నాటికి ఫ్రెంచివారి పూర్తి వలస అయింది.

ఈ శతాబ్దం మొదట్లో ఇది ఫ్రెంచి, పశ్చిమాఫ్రికా లలో భాగమైంది.

ఐవరీకోస్టులో ప్రధాన రాజకీయపార్టీ డెమోక్రటిక్ పార్టీ. 1946 లో ఏర్పడింది. శాసనసభలో మంచి మెజారిటీ వుంది. ఈ పార్టీనాయకుడే ప్రభుత్వాధ్యక్షులుగా వున్నారు.

*　　*　　*

అప్పర్ వోల్టా : (రిపబ్లిక్) అధ్యక్షుడు : మారిస్ యామియోగో. రాజధాని: ఉగాదోవుగూ. వైశాల్యం : 1 లక్షా 6 వేల చదరపుమైళ్ళు. జనాభా : 35 లక్షలు. 1960 ఆగస్టు 8 న స్వాతంత్ర్యం లభించింది.


యామియోగో

దాదాపు రెండుశతాబ్దాలనాడు ఫ్రాన్స్ దీనిని ఆక్రమించింది. అప్పర్ వోల్టా ప్రజల ప్రధాన వృత్తి పశు పెంపకం. ప్రధాన పంటలు : వరి, ప్రత్తి, సగ్గుబియ్యం. ఇంతవరకూ ఖనిజ సంపదను వెలికి తీయలేదు. దేశంలోకల్లా "డెమొక్రటిక్ రాలీ" అన్నదే పెద్దపార్టీ. పార్టీ అధ్యక్షుడు యామియోగోయే దేశ అధ్యక్షులూ, ప్రధానమంత్రీ కూడా. తెగల నాయకులు రాజకీయ జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తున్నారు. ఈ తెగ లకు "వోల్టా తెగ నాయకుల సంఘం" అని వేరే ఒక రాజకీయ సంస్థ వుంది.

*　　*　　*

మధ్యాఫ్రికా రిపబ్లిక్ : అధ్యక్షుడూ, ప్రధానీ : డేవిడ్ డాకో. రాజధాని : బంగూయీ; జనాభా : 11 లక్షలు.

మధ్యాఫ్రికా రిపబ్లిక్ ఆఫ్రికాలోని కడు పేదప్రాంతాలలో ఒకటి. వ్యవసాయం ప్రజల ప్రధానవృత్తి. పరిశ్రమలు అభివృద్ధి కాలేదు. సబ్బుల ఫ్యాక్టరీ, చిన్న చిన్న బంగారం, వజ్రాల గనులు మినహా పెద్ద పరిశ్రమలేవీ లేవు. 1894 లో ఫ్రెంచివాళ్ళు

డాకో

దీన్ని ఆక్రమించుకొన్నారు. అప్పటినుండీ యిది, 1958 వరకూ ఉబాంగీ - షారీ అని వ్యవహరించబడుతున్న ఈ క్వెటోరియల్ ఆఫ్రికాలో భాగంగావుంది. 1958 లో ఈక్వెటోరియల్ ఆఫ్రికా సమాఖ్య రద్దయింది. "ఫ్రెంచి సమాఖ్య"లో సభ్యరాజ్యంగా యీ వలస మార్పు చెందింది, దీనిపేరు స్థానిక శాసనసభ నిర్ణయంప్రకారం "మధ్యాఫ్రికా రిపబ్లిక్" (సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్)గా అనవతరించింది.

దేశరాజకీయ జీవితంలో బార్తెలెమీ బోగాండా స్థాపించిన "మెసాన్" ఉద్యమానికి యెక్కువ పలుకుబడి వుంది. "మెసాన్" అంటే నల్లని ఆఫ్రికాలో సాంఘిక పరిణామాన్ని గొనివచ్చే ఉద్యమం అని అర్థం. బోగాండా గత సంవత్సరం (1959) ఒక విమాన ప్రమాదంలో చనిపోయారు.

గతంలోనూ, ఇప్పుడూ ఫ్రెంచి, పోర్చుగీసు, బెల్జియం లేదా స్పానిష్ వలసపాలనక్రింద వున్న ఆఫ్రికా ప్రాంతాలన్నింటిని కలిపే "లాటిన్ ఆఫ్రికా సమైక్యరాజ్యాలు"గా

పర్వస్థానాలని మెసాన్ నాయకులు సూచించారు. మధ్యాఫ్రికా రిపబ్లిక్‌కు 1960 ఆగస్టు 13 న స్వాతంత్ర్యం లభించింది.

*　　*　　*

గాబన్ : ప్రధానమంత్రి : లియోన్ ఎంబా; రాజధాని, లైబ్రెవిల్లీ; వైశాల్యం; 1,03,089 చదరపు మైళ్ళు, జనాభా : 4 లక్షల 870 వేలు; 1960 ఆగస్టు 17 న స్వాతంత్ర సార్వభౌమాధికరం గల స్వతంత్ర రిపబ్లిక్‌గా అవతరించింది.



ఎంబా

గాబన్ భూభాగమంతా అడవులకు ప్రసిద్ధి. మేలురకం కలప లభిస్తుంది. ప్రధాన ఉత్పత్తులు : ముడి ఇనుము, మాంగనీసు, బంగారం, వజ్రాలు, నూనె, యురేనియం లభిస్తాయి. ఫ్రాన్స్ ఆమధ్య ప్రయోగించిన ప్రప్రథమ అణుబాంబుకు గాబన్ యురేనియంనే వాడారు. ఫ్రెంచి, అమెరికన్, పశ్చిమ జర్మనీ గుత్తవ్యాపార సంస్థలు గాబన్ ఖనిజ సంపదను దోచుకుంటున్నాయి. వారంతా కలసి "గాబన్ సిండికేట్ ఆఫ్ మైనింగ్ ఎంటర్‌ప్రైజెస్" అనే గుత్తసంస్థను యేర్పరిచారు. ప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం. మొక్కజొన్న పండిస్తారు. కాఫీ, తదితర పంటలుకూడా పండిస్తారు.

గాబన్‌లో ప్రవేశించిన మొదటి యూరోపియన్లు పోర్చుగీసు నావికులు. 1585 లో వారు యిక్కడ ఒక నదీ ముఖం వద్ద దిగారు. ఈ నదిని వారు "కాబిన్ నది" అని పిలచేవారు.

గాబన్ అన్న పేరు దానినుండి వచ్చిందే. 1839 లో గాబన్ తీరంపై మొట్టమొదటి వలస ఏర్పడింది. తరువాత అర్థ శతాబ్దంలో మొత్తం దేశమంతా ఫ్రెంచి వలస పెత్తందార్ల చేతుల్లోకి వచ్చింది.

ప్రధాన రాజకీయ పార్టీలు: డెమోక్రటిక్ బ్లాక్; డెమోక్రటిక్ సోషల్ యూనియన్; నేషనల్ యూనిటీపార్టీ. ప్రస్తుత పాలకవర్గ పార్టీ డెమోక్రటిక్ బ్లాక్.

* * *

(ఫ్రెంచి) కాంగో రిపబ్లిక్: అధ్యక్షులు ఫుల్‌బర్ట్ యోలూ; రాజధాని బ్రజెవిల్లీ; జనాభా: 7 లక్షలు; 1960 ఆగస్టు 15 న స్వాతంత్ర్యం వచ్చింది.



యోలూ

కాంగో(ఫ్రెంచి)రిపబ్లిక్ లోకూడా అడవు లెక్కువే. నాణ్యమైన కలప లభ్యమవు తోంది. ప్రజల ప్రధానవృత్తి వ్యవసాయం.

కాంగో (బెల్జియంకాంగో పేరు) ను ఫ్రెంచివారు ఆక్రమించడానికీ, ప్రభుత్వ సాయంతో 1879 - 82 సంవత్సరాల మధ్య సైనికయాత్ర ప్రారంభించిన నౌకాధికారి డి బ్రెజ్జా పేరుకూ సంబంధంవుంది ఈ బ్రెడీ యాత్ర తలపెట్టింది, గాబన్‌కు నైరుతిగావున్న ప్రాంతాన్ని స్వాధీనం చేసుకోడానికే. ఈ ఉద్దేశాన్ని కప్పి పెట్టడంకోసం అతని యాత్రకు ఏదో విద్యా ప్రతినిధివర్గం అని ఒక ముసుగు తగిలించారు.

డి|బ్రెజ్జా 1880 సెప్టెంబరులో మాకోకో అనే "తెగ" నాయకునితో ఒక సంధి కుదుర్చుకోవడం ద్వారా, ఫ్రెంచి వాళ్ళు ఈక్వెటోరియల్ ఆఫ్రికాలోని పెద్ద భూభాగాన్ని పొందడమే గాకుండా, తమకు పోటీదార్లయిన బెల్జియం వలసాధికారులకు సముద్ర పర్యటనకు వీలు లేకుండా చేయగలిగారు. ఆ తెగనాయకుని ఆధీనంలోవున్న ప్రాంతాలన్నీ కాంగోనదికి ఉత్తరంగా వున్నాయి. బెల్జియం వలసాధిపతులు కాంగో నది ఎడమతట్టును చేరుకున్నారు. ఆ విధంగా నదికి మధ్యస్థంగా వుండే భూభాగాన్ని మధ్య కాంగో అన్నారు. నెమ్మదిగా అది కాస్తా ఫ్రెంచి ఈక్వెటోరియల్ ఆఫ్రికాలో కలిపివేయబడింది. 1958 లో (ఫ్రెంచి) కాంగో ఫ్రెంచి సమాఖ్యలో భాగంగా ప్రకటించేటప్పుడు, దాని పేరును కాంగో రిపబ్లిక్ గామార్చారు. ఈరోజున యిదే పేరుగల రెండు దేశా లున్నాయి (రెండోది బెల్జియం మాజీవలసైన కాంగో). ప్రధాన పార్టీలు: డెమోక్రటిక్ యూనియన్, ఆఫ్రికన్ సోషలిస్టు ఉద్యమం. కాంగో ఆఫ్రికన్ కార్మిక సమాఖ్యకూడా రాజకీయ జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తోంది.

* * *

చాడ్ రిపబ్లిక్: అధ్యక్షులు: ఫ్రాంకోయి టాంబాల్‌బే; రాజధాని: ఫోర్ట్ లామీ; వైశాల్యం: 9 లక్షల చదరపుమైళ్ళు. జనాభా: 23 లక్షలు. 1960 ఆగస్టు 11 న స్వాతంత్ర్యం లభించింది. బాగా వెనుకబడ్డ ప్రాంతం. ప్రత్తి ప్రధానపంట. పరిశ్రమలు లేవు. ఫ్రెంచివారి మాజీ వలస. ప్రజా ప్రతిఘటన బలవత్తరంగా వున్నందు

వలననే ఐందు సంవత్సరాలు గట్టి పోరాటం నడిపినంతనే స్వాతంత్ర్యం లభించింది. ప్రధానమైన రాజకీయపార్టీలు: ప్రోగ్రెసివ్ పార్టీ; యూనియన్ ఆఫ్ ఇండిపెండెంట్స్; పాప్యులర్ మూవ్‌మెంట్; ఆఫ్రికన్ నేషనల్ పార్టీ.

*　　　*　　　*

నైగీరియా: ఫెడరల్ ప్రధాని: తవాఫా బాలేవా. రాజధాని: లాగోస్; వైశాల్యం: 3,73,250 చదరపు మైళ్ళు. జనాభా: 3 కోట్ల 20 లక్షలు. 1960 అక్టోబరు 1 న స్వాతంత్ర్యం లభించింది.




60 ఏళ్ళుగా బ్రిటిష్‌వలసగా వున్న నైగీ(జీ)రియా ఆఫ్రికాలోకల్లా జనాభా ఎక్కువగా వున్న ప్రాంతం. సంపదవంతమైన ప్రాంతం. (ఇందులో బ్రిటిష్ కామెరూన్స్‌కూడ చేర్చబడింది).

నైగీరియా ఆఫ్రికాఖండం పశ్చిమ కోస్తాలో గినీ అఖాతంమీద వున్నది. భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత మిగిలివున్న బ్రిటిష్ వలసల్లో నైగీరియాయే పెద్దది.

ఆఫ్రికాఖండంలో యిదే అన్నిటికన్నా పెద్దదేశం. దీని పొడవు తూర్పు - పడమరల్లో 700 మైళ్ళదాకానూ, ఉత్తర-

దక్షిణాల్లో 650 మైళ్ళదాకానూ వున్నది. దానికి 500 మైళ్ళ కోస్తాకూడా కలదు. విభిన్న ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, భాషలూ గల అనేక కొండజాతులకూ, తెగలకూ ఇది నిలయం. నైగీరియా మూడు మండలాలుగా విభాజితమై వున్నది. ఒకటి ఉత్తరమండలం (జనసంఖ్య దాదాపు రెండు కోట్లు); రెండోది పశ్చిమ మండలం (జనసంఖ్య 70 లక్షలు); మూడోది తూర్పుమండలం (జనసంఖ్య 80 లక్షలు) ఇవికాక, వీటన్నిటికీ సంయుక్త రాజధానిగావున్న లాగోస్‌లో మూడు న్నర లక్షలమంది జనాభా ఉన్నారు.

ఉత్తర మండలంలో హౌసా, ఫులానీ అనే తెగలు, పశ్చిమ మండలంలో యోరుబా అనేవారు, తూర్పు మండలంలో ఇబోలనేవారు అధిక సంఖ్యాకులు.

15 వ శతాబ్దంలో నైగీరియన్ కోస్తామీద మొట్ట మొదట కాలుపెట్టిన యూరపియన్లు బుడతకీచులు. 1553 లో మొట్టమొదటి ఇంగ్లీషుఓడ అక్కడ లంగరు వేసింది. దీనికి బానిస కోస్తా అని పేరుపెట్టి 16, 17 శతాబ్దాల్లో విపరీతంగా కొల్లగొట్టారు. 1899 జూలైలో బ్రిటిష్ కామన్స్‌సభ రాయల్ నైగర్ కంపెనీ బిల్లును చర్చిస్తూ 'నైగీరియా' అని నామకరణం చేసింది. 1900 లో బ్రిటిష్ వలసగా చేసుకున్నది. ప్రథమ ప్రపంచ మహాసంగ్రామానంతరం పూర్వం జర్మనీవాళ్ళక్రింద ఉన్న కామరూన్స్‌ను కూడా బ్రిటిష్‌వాళ్ళు వశపర్చుకొని 1922 లో నైగీరియాతో కలిపివేశారు. ఇప్పుడు, నైగీరియాకు స్వాతంత్ర్యం ప్రకటిస్తూ, ఆ బ్రిటిష్ కామరూన్స్‌ను మళ్ళీ వేరు చేసి వలసగానే అట్టిపెట్టుకున్నారు.

నైజీరియా స్వాతంత్ర్యంకోసం ఉత్తర ప్రజా కాంగ్రెసు నైగీరియా – కామరూన్స్ జాతీయసమితి, కార్యాచరణ సంఘం అనే మూడు రాజకీయపక్షాలూ చాలకాలంనుంచి పోరాడుతున్నాయి. అల్హాజీసర్ అహమద్ బెల్లా (ఉత్తర మంటలం) డాక్టర్ నాండీ అజికివే (వీరిని 'జిక్' అని పిలుస్తుంటారు తూర్పుమండలం. (ఒబాఫెమీ అవోలోవో) పశ్చిమ మండలం) – యీ ముగ్గురూ పై రాజకీయ పక్షాలకు ప్రధాన నాయకులు. వీరు కాక అల్హాజీసర్ అబుబాకర్ బాలెవా అనే వారు కూడా సంయుక్త పార్లమెంటులో ముఖ్యులు.

నైగీరియన్ ఫెడరేషనులో ఏ ఒక్క పార్టీకి పూర్తి మెజారిటీ లేకపోయినా, ఆ యా మండలాల్లో ప్రధాన పార్టీలైన యీ మూడూ కలిసి స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామ్యానికీ తగు జాగ్రత్తలు ఏర్పర్చుకున్నాయి

ఇక నైగీరియాలోని మూడు మండలాలకూ వేర్వేరు శాసనసభలు, మంత్రివర్గాలు ఉంటాయి. గవర్నర్లు కూడా వేర్వేరే. ఇవికాక, నైజీరియా అంతకూ కలిపి సంయుక్త శాసనసభ, ప్రభుత్వమూ వుంటాయి. అలాగే గవర్నరు జనరల్ ఒకరుంటారు. కేంద్ర శాసనసభలోని 312 స్థానాల్లోనూ ఉత్తర ప్రజా కాంగ్రెసుకు 142, నైగీరియా – కామెరూన్ల జాతీయ సమితికి 89, కార్యాచరణ సంఘానికి 73 స్థానాలున్నాయి. అల్హాజీ సర్ అబుబాకర్ బాలెవా ఫెడరల్ ప్రభుత్వానికి ప్రధాన మంత్రిగా వున్నారు. డాక్టర్ అజికివే (జిక్) గవర్నరు జనరలుగా వున్నారు.

ఉత్తర మండలంలో ముస్లిం రాజవంశీకుల ప్రాబల్యం హెచ్చు. అందుచేత అది అట్టే అభివృద్ధికాలేదు; దానికి తగ్గట్టు ప్రజాతంత్ర సంప్రదాయాలుకూడా తక్కువ. అక్కడ వున్న ఉత్తర ప్రజాకాంగ్రెసుకూడా కరుడుకట్టిన మితవాద పక్షం. ఇటీవల ఆఫ్రికాఖండంలో పెల్లుబికిన కొత్త వెల్లువ చూచి, అది బిత్తరపోతున్నది. ఫెడరల్ పార్లమెంటులో యిదే పెద్దపార్టీ.

పశ్చిమ మండలంలో బూర్జువావర్గం బలంగా ఉన్నది. అక్కడి కార్యాచరణ సంఘానికి బూర్జువవర్గమే నాయకత్వం వహిస్తుంది. ఫెడరల్ పార్లమెంటులో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్న అవొలోవోవే యీ పార్టీ నాయకుడు. ఈ పార్టీ సాంఘిక సంస్కరణలకు సుముఖం. కాని జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ మితవాద ధోరణుల నవలంబిస్తుంది. ఆఫ్రికాలోని ఇతర పార్టీలవలెగాక, ఇది పశ్చిమ రాజ్యాల కూటమికి అనుకూలం.

తూర్పు మండలంలో నైజీరియా–కామెరూన్ల జాతీయ సమితి చాలా బలమైన రాజకీయ పక్షం. గవర్నర్ జనరల్‌గా ఉన్న జిక్ దీనికి నాయకులు. ఇది ఫెడరల్ పార్లమెంటులోని ఇతర పార్టీలకన్న అభ్యుదయకరమైన పక్షం. నైజీరియా అంతా ఒకే జాతిగా ఉండాలని వీరి వాదం. అలాగే ఆఫ్రికా దేశాలన్నీ ఐక్యంకావాలనీ, అంతర్జాతీయ రాజకీయాల్లో ఏ కూటమితోనూ కలవకుండా క్రియాశీల తటస్థవిధానం అవలంబించాలని వీరి ఉద్దేశం.

*   *   *

# అస్వతంత్ర దేశాలు

మారిటానియా : (ఫ్రెంచి సమాఖ్యలోనిది) ప్రధాని: ముక్తార్ జౌద్ దాధా; రాజధాని:నౌక్చాత్; వైశాల్యం : 3 లక్షల 86 వేల చదరపు మైళ్ళు; జనాభా: 6 లక్షల 20 వేల మంది. ఇది ఇస్లామిక్ రిపబ్లిక్. ఫ్రెంచి సమాఖ్యలో భాగంగానే 1961 లో స్వాతంత్ర్యం పొంద నున్నది. 15 వ శతాబ్దంలో మొట్ట మొదట ఇక్కడ కాలుపెట్టినవారు పోర్చుగీసు బుడుత కీచులు. 1902-14 సంవత్సరాలలో ఫ్రెంచి



దౌద్ దాధా

వారు దేశాన్ని ఆక్రమించారు. ప్రజలు తీవ్రంగా ప్రతిఘటించారు. ఒక్క 1908 లోనే వివిధ తెగలకు చెందిన ప్రజలు దురాక్రమణదారులపై 125 సార్లు పోరాటం నడిపారు. 1920లో మారిటానియా ఫ్రెంచి వలసగామారింది. మొదట్లో దేశంలో నివసించినవారు బర్బరులూ, మూర్లు. అందుకనే "మారిటానియా" అని దానికి పేరు వచ్చింది. ప్రజల ప్రధాన వృత్తి పశువుల పెంపకం. గొర్రెలు, మేకలూ ఎక్కువ. పరిశ్రమలు లేవనే చెప్పాలి. నాణ్యమైన ముడి ఇనుము లభ్యమవుతుంది. విదేశీ గుత్తసంస్థల కన్ను పడింది.

మారిటానియాలో ముఖ్యమైన రాజకీయ పార్టీ: మారిటానియన్ రాలీ.

* * *

టాంగన్యీకా: (ఐ రాస ధర్మకర్తృత్వ పాలన క్రింద నున్న బ్రిటిష్‌పాలిత ప్రాంతం) ముఖ్యమంత్రి జూలియస్ నైరేరి. రాజధాని: దారీసాలామ్, వైశాల్యం: 3 లక్షల 42 వేల 706 చదరపుమైళ్ళు. జనాభా 80 లక్షలు. బ్రిటిష్ వలసపాలకుల భాషలో చెప్పాలంటే 1960 అక్టోబరు 11 న టాంగన్యీకాకు "బాధ్యతాయుత పాలన" లభించింది. అంటే ఆంతరంగికంగా స్వపరిపాలన అన్నమాట.

76 సంవత్సరాలుగా విదేశ దాసత్వంక్రింద వుంది. 1905 లో "మజి - మజీయుద్ధం" అనే సాయుధ తిరుగుబాటు వచ్చింది. ఈ యుద్ధం 1906 లో ముగిసింది. మొత్తం 1 లక్షా 20 వేల మంది నిండుజీవాలు ఆహుతైనాయి. ఇది టాంగన్యీకా చరిత్రలోనే విషాదఘట్టం. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం టాంగన్యీకా వర్సైల్స్ సంధిప్రకారం బ్రిటిష్ మాండేటరీ ప్రాంతంగా మారింది. టాంగన్యీకాలో కొంత భాగం (ఇప్పుడు రువుండా - ఉరుండీగా వున్న ప్రాంతం) జర్మనీని ఓడించడంలో సాయపడినందుకు బెల్జియంకు దానం చేశారు.

బ్రిటిషువాళ్ళు అప్పటినుండీ రువుండా - ఉరుండీ బెల్జియం వలసగా వుంటోంది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరంకూడ బ్రిటన్ ఐ.రా.స. ధర్మకర్తృత్వం ముసుగుక్రింద

టాంగన్నీకా ఆధిపత్యం చెలాయిస్తూనే వచ్చింది. 1929 లో స్వాతంత్ర్యోద్యమానికి గట్టిపునాది పడింది. నైరీరి నాయకత్వాన టాంగన్నీకా ఆఫ్రికన్ నేషనల్ యూనియన్ 1954 లో ఏర్పడింది. 1958 ఎన్నికల్లో ఈ పార్టీకి మెజారిటీ వచ్చింది. టాంగన్నీకాలో ఖనిజసంపద అపారం. ప్రధానంగా వ్యవసాయ దేశం. త్వరలోనే సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించనున్నది.

* * *

సియర్రా లియోన్ : (బ్రిటిష్ వలస) ప్రధాని : మిల్టన్ మార్గాయి; రాజధాని ఫ్రిటౌన్, వైశాల్యం 27 వేల 925 చదరపు మైళ్ళు; జనాభా : 23 లక్షలు.

కామన్వెల్తులో భాగంగా 1961 నాటికి సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తుందని బ్రిటన్ హామీ యిచ్చింది.

* * *

కెన్యా : (బ్రిటిష్) రాజధాని నైరోబీ; వైశాల్యం : 2 లక్షల 24 వేల 960 చదరపు మైళ్లు. జనాభా 62 లక్షలు. స్వపరిపాలన యిస్తామని బ్రిటన్ హామీ యిచ్చింది. మంత్రి వర్గంలో ఆఫ్రికన్లకే ఎక్కువస్థానా లుండాలని కెన్యా జాతీయోద్యమ నాయకులు డిమాండ్ చేస్తున్నారు. కెన్యా ప్రజల ప్రియతమ నాయకులు జోమో కెన్యాట్టా, టాంబోయాలు ఇటీవల కెన్యా రాజ్యాంగ సంబంధమైన చర్చల నిమిత్తం లండన్‌లో జరిగిన సమావేశానికి టాంబోయా హాజరైనారు. జోమో కెన్యాట్టాపై నేటికీ నిర్బంధ విధానం

అమలులోవుంది. మారుమూల ప్రాంతాలకు వలస వాదులు ప్రవాసం పంపారు.



కెన్యట్టా



టాంబో యా

కెన్యా తూర్పు ఆఫ్రికాలో కీలక ప్రాంతంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భావిస్తున్నారు. ఈనాడు కెన్యాలోని మొత్తం జనాభాలో ఒకటోవంతు మాత్రమే వున్న 60 వేల మంది యూరోపియన్ల చేతుల్లో మొత్తం సాగుకు లాయకైన భూమిలో నూటికి 20 శాతానికి పైగావుంది. ఆఫ్రికన్లకు వేరే మాలపల్లెలేర్పరచారు. ప్రస్తుతం కెన్యా శాసనసభలో 18మంది సభ్యులున్నారు. వీరు 60 లక్షల మంది ఆఫ్రికన్లకు ప్రాతినిధ్యం వహిస్తూండగా, 38 మంది యూరోపియన్ల ప్రతినిధులు 60 వేల మందికి మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్నారు. 1952 – 1955 సంవత్సరాలమధ్య బ్రిటీషు వలసాధికారులు 10 వేల మంది ఆఫ్రికన్లను చంపారు. 62 వేల మందిని జైళ్ళపాలు చేశారు.

* * *

## బసూటోలాండ్, బెచూనాలాండ్, స్వాజీలాండ్

ఈ మూడు బ్రిటిష్‌వలసలుకూడా స్వపరిపాలనా పథంపై పు నడుస్తున్నాయి.

బసూటోలాండ్ : వైశాల్యం 11 వేల 716 చదరపు మైళ్ళు; జనాభా : 43 లక్షల 43 వేల 348 మంది. వీరిలో సగంమంది క్రైస్తవులే. రాజధాని : మసేరూ. ప్రజల ప్రధాన వృత్తి పశుపెంపకం. ప్రధాన ఎగుమతులు ఉన్ని. ప్రధాన దిగుమతులు మొక్కజొన్న, గోధుమలు. బసూటోలాండ్ వ్యాపారంలో యెక్కువభాగం పశ్చిమంగావున్న దక్షిణాఫ్రికాతో నే సాగుతోంది. మొత్తం భూమిలో 12.4 శాతం మాత్రం సాగుకులాయకైన భూమి.

బసూటోలాండ్‌ను హైకమీషన్ ఉత్తర్వుల ననుసరించి రెసిడెంట్ కమీషనర్ అనే స్థానికాధికారి పాలిస్తున్నాడు. బసూటోలాండ్, బెచూనాలాండు, అధీనప్రాంతం; స్వాజీలాండ్‌లకు కలిపి ఒకే హైకమీషనర్ వున్నాడు. ఇతడు దక్షిణాఫ్రికాలోకూడా హైకమీషనర్‌గానే వ్యవహరిస్తాడు. బసూటోలాండులో శాసనసభ ఒకటె వుంది. ఇందులో 80 మంది సభ్యులున్నారు. వీరిలో 76 మంది ఆఫ్రికన్లు.

బెచూనాలాండు : బ్రిటిష్‌వారి అధీనంక్రింద వుంది. 1885లో ఆక్రమించారు. వైశాల్యం 5,34000 చదరపుమైళ్ళు. జనాభా : 3,27,000.

స్వాజీలాండ్ : బ్రిటిష్ అధీనప్రాంతంగా వుంది. 19వ శతాబ్దంలో ఆక్రమించారు. వైశాల్యం 13,050 చదరపుమైళ్లు. జనాభా : 2 లక్షల 37 వేలు.

*　　　　*　　　　*

రొడీషియా, న్యాసాలాండ్ సమాఖ్య : ఫెడరల్ ప్రధాని : సర్ రాయ్ వెలెన్స్కీ; రాజధాని : శాలిస్బరీ; వైశాల్యం 4 లక్షల, 78 వేల 10 చదరపుమైళ్ళు. జనాభా : 73 లక్షలు.

ఈ సమాఖ్య బ్రిటిష్‌వారి ఆధిపత్యంలోవున్న వలస. ఇటీవల తూర్పు ఆఫ్రికాలో వస్తున్న జాతీయోద్యమాల తాకిడికి తట్టుకోలేని బ్రిటిష్ ప్రభుత్వం "రాజ్యాంగ సంస్కరణల" కోసమంటూ మాంక్టన్ కమిషన్ నొకదాన్ని నియమించింది. ఇది ఆయా బ్రిటిష్ వలసల్లో పర్యటించి, పరిస్థితిని అవగాహన చేసుకుని, అందుకుతగ్గ సూచనలను చేస్తుంది. ఈ కమిషన్ రొడీషియా, న్యాసాలాండ్ సమాఖ్య (ఫెడరేషన్)లో కూడా పర్యటించింది. ఫెడరేషన్‌కు నూతన రాజ్యాంగాన్ని కమిషన్ తయారు చేస్తోంది. ఈ సమాఖ్య ప్రాంతాలలో స్థిరపడిపోయిన తెల్లవాళ్ళ భోగ భాగ్యాలకు, నిత్య దారిద్ర్యం అనుభవిస్తున్న ఆఫ్రికన్లు సహించలేకపోతున్నారు. జాతి విద్వేషం ప్రబలుతోంది. ఉభయజాతులమధ్య అనేకసార్లు కొట్లాటలు జరిగాయి.

వంద సంవత్సరాల క్రితం కింబర్లీ చుట్టూ వజ్రాలూ, రాండ్‌లో బంగారమూ దొరకడంతో, ప్రపంచంలోని అనేక

మంది సాహసికులదృష్టి వాటిపై పడింది! వీరిలో "రోడ్స్" అనే అతను ముఖ్యుడు. అటు "కేప్" నుండి ఇటు కైరో వరకూ బ్రిటిష్ సామ్రాజ్యాన్ని విస్తరింపజేయాలని తీవ్రంగా కలవరించాడు. రోడ్స్ చాల క్రూరుడు, మోసగాడు. దక్షిణాఫ్రికా సంతటినీ స్వాహాచేసేందుకు ఎన్ని కుయుక్తులు పన్నాలో అన్నీ పన్నాడు. తుదకు మొత్తం దక్షిణ, మధ్య ఆఫ్రికా దేశాలలోని ఆఫ్రికా ప్రజలను బానిసబంధనాల్లో చిక్కించడానికి దారితీసిన దొంగవిధానాలను రూపొందించింది ఈ రోడ్సే అటువంటి రోడ్స్ ఏర్పర్చిన "బ్రిటిష్ దక్షిణాఫ్రికా కంపెని" యే దక్షిణ రొడీషియాను ఆక్రమించి, దానిని తన స్వంతఆస్తిగా 1924 వరకూ ఏలుకున్నది.

ఈనాడు బ్రిటిష్ గుత్తవర్గాలకు చెందిన ఆరు మైనింగ్ కంపెనీలు బంగారం, యురేనియం, వజ్రాలు వగైరా ఖనిజ సంపద నంతటినీ గుప్పెట్లో పెట్టుకు కూర్చున్నాయి. ఉత్తర రొడీషియాలోని అపారమైన రాగి గనులలో సగానికిపైగా ఆంగ్లో అమెరికన్ కార్పొరేషన్ అనే మరొగుత్తసంస్థ ఆధ్వర్యం క్రిందనున్నాయి. ఉత్తర రొడీషియాలోని రాగిగనులు ఏటా 10 కోట్ల పౌండ్ల విలువగల రాగిని ఉత్పత్తి చేస్తున్నాయి. అయితే ఈ మొత్తాలన్నీ ఆఫ్రికా కార్మికవర్గ ప్రయోజనాలకు ఏమైనా వినియోగిస్తున్నారా? "లేదు" అన్నదే సమాధానం.

మధ్య ఆఫ్రికా ఫెడరేషన్‌ను ఏర్పర్చినవారు 1953 లో ఉత్తర, దక్షిణ రొడీషియాలు, న్యాసాలాండ్ అనే మూడు భూభాగాలను కలిపి ఒకే రాష్ట్రంగా మార్చారు. ఇలా చేయడంలో వలసాధికారుల ఉద్దేశం — 70 లక్షల మంది

ఆఫ్రికన్ కార్మిక జనావళిపై గనుల యజమాన్లు, భూస్వాములు, పెట్టుబడిదారులూ పెత్తనం చెలాయించేటట్లు అన్ని అవకాశాలు కల్పించడమే.

దక్షిణ రొడీషియాలో 2 లక్షలమంది తెల్లవాళ్ళు న్నారు; 20 లక్షల మంది ఆఫ్రికన్లు వున్నారు. బ్రిటిష్ వాళ్ళ మాటల్లో చెప్పాలంటే ఈ ప్రాంతంలో "బాధ్యతాయుత పాలన" 1923 నుండే అమలులోవుంది. అంటే "ఆఫ్రికా ప్రజల సంక్షేమానికి" సంబంధించిన విషయాలలో 'అవసర మను కుంటే' బ్రిటిష్ ప్రభుత్వం దక్షిణ రొడీషియాలో జోక్యం కల్పించుకోవచ్చన్న మాట.

ఉత్తర రొడీషియా బ్రిటిష్ అధీనప్రాంతం. బ్రిటిష్ పార్లమెంటుకు దానిపై అధికారం చెలాయించే హక్కువుంది. ఆచరణలోమాత్రం, 70 వేలమంది మాత్రమేవున్న తెల్లజాతి వారు తమ స్వప్రయోజనార్థం ఈ ప్రాంతాన్ని పాలిస్తున్నారు. కాని మిగతా 22 లక్షల 50 వేలమంది ఆఫ్రికన్లు అసలైన విషయాలలో నోరూవాయీ లేకుండా వున్నారు.

న్యాసాలాండ్ కూడా బ్రిటిష్ అధీనప్రాంతమే. వలస ప్రాంతంగా దీనిని లండన్ ప్రభుత్వం పరిపాలిస్తోంది. న్యాసా లాండ్‌లోని 27 లక్షల 50 వేలమంది ఆఫ్రికన్లకు అన్ని రాజకీయహక్కులూ వ్యర్థమైనాయి. తమ దేశ ప్రభుత్వంలో తమకే మాట లేకుండా పోయింది.

దక్షిణ రొడీషియాలోని తెల్లజాత్యహంకారులు మితి మీరి ప్రవర్తిస్తున్నారు. దక్షిణాఫ్రికాలోని వెర్వోర్డ్ప్రభుత్వం

అనుసరించే వర్ణవివక్ష విధానాలకన్నా యెక్కువ క్రూరంగా దక్షిణ రొడీషియా ప్రభుత్వం వ్యవహరిస్తోంది. దక్షిణ రొడీషియా పార్లమెంటులో ఒక్క ఆఫ్రికన్ ప్రతినిధికూడా లేడు. మన దేశంలో గ్రామాలకు దూరంగా మాలవారిని వేరుచేసి మాలపేటలు కట్టినట్లే, అక్కడకూడా ఆఫ్రికన్లకు వేరే రిజర్వు ప్రాంతాలపేరుతో మారుమూలలకు త్రోసివేస్తున్నారు. ఆఫ్రికా కార్మికుని ఏడాదికి సగటు ఆదాయం 80 పౌండ్లుకాగా, యూరోపియన్ కార్మికుని సగటు ఆదాయం 995 పౌండ్లు.

ఇదిలావుండగా ఉత్తర రొడీషియాలోని వలసాధికారులు దక్షిణాఫ్రికా, దక్షిణ రొడీషియాల పద్ధతిని అనుసరించ పూనుకుంటున్నారు. ఉత్తర రొడీషియాలో ఉత్పత్తి పరిశ్రమలు లేవు. చాలమంది తెల్లవాళ్ళు రాగిగనుల్లో పనులు చేస్తుంటారు.

మధ్య ఆఫ్రికా ఫెడరేషన్ చరిత్ర కుట్రలతో కూడి వుంది. 1945 ఎన్నికల అనంతరం జాత్యహంకారాన్ని రూపుమాపడానికి బ్రిటిష్ లేబర్‌పార్టీకి మంచి అవకాశం చిక్కింది. మనసుంటే మార్గం లేకపోలేదు. దక్షిణ రొడీషియా పార్లమెంటు వర్ణవివక్షాపూరితమైన చట్టాలను ఆమోదించకుండా "వీటో" ప్రయోగించగల శక్తి, న్యాసాలాండ్, ఉత్తర రొడీషియాలకు స్వాతంత్ర్యం యివ్వగల అవకాశమూ లేబర్ పార్టీకి వుంది. కాని అది జరుగలేదు.

ఈ మధ్యకాలంలో అనేకదఫాలు బ్రిటిష్‌వలసశాఖ అనేక సమావేశాలు ఏర్పర్చిందిగాని వాటికి ఆఫ్రికన్ ప్రతినిధులను

ఆహ్వానించలేదు. ఫెడరేషన్ (సమాఖ్య) పథకాన్ని వ్యతిరేకిస్తూ న్యాసాలాండ్ ప్రజలూ, నాయకులూ సమైక్యమైనారు. 1952 ఫిబ్రవరిలో న్యాసాలాండ్ ప్రభుత్వానికి బాధ్యతవహించే ఉన్నతాధికార ఆఫ్రికా ప్రతినిధివర్గ సంఘమైన ఆఫ్రికన్ ప్రొటెక్టొరేటు కౌన్సిల్ సమావేశంజరిగింది. అది ఫెడరేషన్ పథకాన్ని నిరాకరించింది, 1953 వచ్చేసరికి వ్యతిరేకోద్యమం యింకా ప్రబలింది. ఈ సంవత్సరం కూడా న్యాసాలాండ్, ఉత్తరరొడీషియా ప్రజలు సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం అనేక పోరాటాలు నడిపారు. దక్షిణ రొడీషియా జాత్యహంకార విధానాలు తమకు కూడా ప్రాకకుండా వుండేందుకూ, తమ సంపద ఇతర్లకు పోకుండా పరిరక్షించుకొనేందుకే ఉత్తర రొడీషియా, న్యాసాలాండ్ ప్రజలు సమాఖ్య నుండి విడిపోవాలని ఆందోళన చేస్తున్నారు. ఇది న్యాయమైన కోర్కె. సామ్రాజ్యవాదులు మాత్రమే ఇందుకు కంగారు తినేది. ఏమంటే న్యాసాలాండ్ స్వతంత్రమైతే, తమకు 20 లక్షలమంది ఆఫ్రికన్ కార్మికులు కారుచౌకగా లభించరనీ, ఉత్తరరొడీషియాస్వతంత్రమైతే అక్కడి రాగిగనులు జాతీయం చేయబడతాయనీ వారి భయం.



బాండా

ఉగాండా: (బ్రిటిష్ అధీన ప్రాంతం); వైశాల్యం 93 వేల 981 చదరపు మైళ్ళు. జనాభా: 55 లక్షలు.



ఉగాండా

సంపూర్ణ స్వాతంత్ర్యంకోసం తీవ్ర మైన ఆందోళన సాగుతోంది. 1960 జూలై నెలలో లండన్ నగరంలో ఉగాండా స్వపరిపాలన విషయమై చర్చలు జరిగాయి. కాని విఫలమైనాయి.

ఉగాండా జనాభాలో తెల్లవాళ్ళు 8 వేలమంది మాత్రమే. కాని వీరే సారవంతమైన భూము లన్నింటినీ ఆక్ర మించుకూర్చున్నారు. ఖనిజ సంపదను దోచుకుంటున్నారు. బ్రిటిష్ ఆక్రమిత ప్రాంతాలలో కల్లా ఉగాండా శ్రేష్టమైన కాఫీ, ప్రత్తిని పండించే ప్రాంతం. బ్రిటిషు వలసాధిపతులు తమకు ఈజిప్టునుండి ఉద్వాసన జరిగినతర్వాత, ఉగాండాను ప్రధాన కీలకస్థావరంగా ఎంచుకుంటున్నారు. బ్రిటిషు గవర్నరు చేతుల్లోనే అధికారాలన్నీ వున్నాయి. ఉగాండా రైతుల సాలుసరి ఆదాయం 12 పౌండ్లకన్నా మించడంలేదని 1955 లో విచారణ జరిపిన తూర్పు ఆఫ్రికా రాయల్ కమిషన్ ఒక నివేదికలో ఒప్పుకున్నది.

తూర్పు ఆఫ్రికా వలసల్లో చాలవాటిలో స్థానిక ప్రజలు అధికాధికమైన రాజకీయ హక్కులు కావాలని డిమాండ్ చేస్తున్నారు. వాస్తవానికి ఉగాండా శాసనసభకు అధికారాలు శూన్యమనేచెప్పాలి. ఒకవేళవున్నా, యివ్వబడున్న ప్రాతినిధ్యం ప్రకారం ఆ అధికారాలు ఆఫ్రికన్లకన్నా వలసాధిపతులకే

ఎక్కువ లాభం చేకూర్చేవిగా వున్నాయి. ఉగాండా శాసన సభలో 60 మంది సభ్యులున్నారు. ఇందులో 30 మందిని గవర్నరే నామినేట్ చేస్తాడు. మిగతా 30 మంది ఎన్నికైన వారు! ఎన్నికలు యీ క్రిందివిధంగా జరుగుతుంటాయి:—

ప్రతి వెయ్యిమంది యూరోపియన్లకు ఒక ప్రతినిధిని తెల్లవాళ్లు ఎన్నుకుంటారు. ఆసియా సంతతివారు, ప్రతి 8 వేల మందికి ఒకరిని, ఆఫ్రికన్లు పతి 3 లక్షల మందికి ఒక ప్రతినిధినీ ఎన్నుకుంటారు. ఇది అక్రమ ఎన్నికల పద్ధతి అనేది ప్రతి బడిపిల్లవాడికీ ఈ లెక్కలు చూస్తే తెలుస్తుంది!

ఇలాగాక, ప్రస్తుత శాసనసభను 98 మంది సభ్యులు ఎన్నిక చేయబడే ప్రాతిపదికపై మొత్తం 110 మంది సభ్యులు గల ప్రతినిధుల సభగా మార్చాలని కోరుతూ 1957 జూలైలో ఉగాండాలోని "ప్రోగ్రెసివ్," "లేబర్," "రివ్యూ" అనే పార్టీలూ ముస్లిం యూనియనూ, ఎలెక్టర్ల యూనియన్లు ఒక ప్రకటన చేశాయి. ఒక దశలో బ్రిటిష్‌వాళ్లు ఉగాండాకు స్వాతంత్ర్యం యివ్వం పొమ్మని నిరాకరిస్తే, ప్రజలు ఆగ్రహావేశులైనారు. బ్రిటిష్ ప్రభుత్వ నిరంకుశ వైఖరిని విడనాడకపోతే ఆఫ్రికన్లంతా అన్ని ప్రాతినిధ్య సంస్థలనూ బహిష్కరించాలని ఉగాండా జాతీయ కాంగ్రెస్ 1957 అక్టోబర్‌లో ప్రకటించింది. బోగాండా రాష్ట్రం దేశంలోకల్లా పెద్దదీ, బాగా అభివృద్ధి చెందిన ప్రాంతమున్నూ. 1961 ఆఖరికి ఉగాండాకు కూడా స్వాతంత్ర్యం లభించవచ్చు.

♦ ♦ ♦

# ఇంకా వలసపాలన క్రిందనున్న ప్రాంతాలు

అల్జీరియా: (ఫ్రాన్స్ వలస); రాజధాని: అల్జీర్స్.

వైశాల్యం 23 లక్షల చదరపు కిలోమీటర్లు. జనాభా: 98,75,000.



అబ్బాస్

అల్జీరియా ఉత్తరాఫ్రికాలోనిది. ఫ్రెంచి సామ్రాజ్యవాదుల బెడదను వదలించుకోడానికై గత పది సంవత్సరాలుగా అల్జీరియన్లు తీవ్రఉద్యమం నడుపుతున్నారు. కైరో తాత్కాలిక కేంద్రంగా అల్జీరియాకు ఫెర్హాత్ అబ్బాస్ నాయకత్వాన ఒక తాత్కాలిక ప్రభుత్వం పని చేస్తోం. శాంతియుత పద్ధతులద్వారా అల్జీరియా సమస్యా పరిష్కారానికై అబ్బాస్ ఫ్రెంచి నియంత డిగోల్‌తో సంప్రతింపులు సాగించడానికి ప్రయత్నించారుగాని అవి విఫలమైనాయి. ఇటీవల మిూతాన్ (ఫ్రాన్స్)లో జరిగిన సంభాషణలు సహితం విఫలమైనాయి.

ఒకవైపున అల్జీరియాకు స్వయంనిర్ణయాధికారహక్కును గుర్తిస్తున్నానని డిగోల్ (1959 సెప్టెంబరు 16న) ప్రకటించినా

ఆ మాటపై అతను నిలబడలేదు. 'స్వయంనిర్ణయాధికారహక్కు' అనే ముసుగుక్రింద మరికొన్ని వేలమంది ఆల్జీరియన్లను ఊచకోత కోయడానికే డిగోల్, ఆయన అనుచరులూ సిద్ధపడుతున్నారు. ఐ. రా. స. పర్యవేక్షణక్రింద ఆల్జీరియాలో జనవాక్యసేకరణ జరపడానికి తాము సుముఖమేనని ప్రధాని అబ్బాస్ ప్రకటించగా, డిగోల్ పెదవి కదపలేదు. ఏది ఏమైనా ఆల్జీరియాలో శాశ్వతశాంతి ఏర్పడాలంటే ఈ క్రింది ప్రధాన కోర్కెలను ఫ్రాన్స్ అంగీకరించితీరాలి.

1. వెంటనే సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటించాలి.
2. ఎన్నికల విషయం ఆల్జీర్స్ ప్రజలే నిర్ణయించుకోవాలి.
3. రాజకీయ ఖైదీల నందరినీ విడుదలచేయాలి.
4. ఫ్రెంచి పౌరులకు ఆల్జీరియా పౌరులతో సమాన హోదా సూత్రమే వుండాలి.

ఫ్రాన్స్ - ఆల్జీరియా యుద్ధంలో యిప్పటికి కొన్ని లక్షలమంది నిహతులైనారు.

అంగోలా, మొజాంబిక్ : (పోర్చుగీస్ వలసలు): మొత్తం వైశాల్యం 7,79,081 చదరపు మైళ్ళు. జనాభా 1 కోటి మంది.

ఈ వలసల్ని గురించి బయట ప్రకటించడానికి అందే సమాచారమే తక్కువ. కారణం—క్రూర నిర్బంధ విధానం.

ఈ రెండు ప్రాంతాలను కలిపి పోర్చుగీస్ ఆఫ్రికా అని వ్యవహరిస్తున్నారు. ఇందులోనే పోర్చుగీస్ గినియా, కాబిందా వగైరా చిన్న చిన్న వలసలుకూడా వున్నాయి.

అంగోలా, మొజాంబిక్‌లు ఆఫ్రికా దక్షిణ భాగంలో వున్నాయి. అంగోలా అట్లాంటిక్ సముద్రతీరంలో వుంది. మొజాంబిక్ హిందూమహాసముద్రపు ఒడ్డునవున్నది. అంగోలా జనాభా: 40 లక్షలు పైచిలుకు; మొజాంబిక్ జనాభా 61 లక్షలు. 1951 లో వాటికి "సముద్రాంతర భూభాగాల ప్రతిపత్తి" లభించింది. ఇవి పోర్చుగీసువారి క్రిందకువచ్చి 500 సంవత్సరాలు గడిచాయి. ఈ అయిదు శతాబ్దాల కాలంలో బుడతకీచులు ఈ దేశాలకు ఒరగబెట్టిందేమిటో బ్రిటిష్ పత్రిక "వరల్డ్ న్యూస్" యిలా వెల్లడించింది:

"వెనుకటి పోర్చుగీస్ సామ్రాజ్యవాదులు బానిస వ్యాపారం సాగించారు. ఇటీవలకాలంలో దీనిస్థానే వెట్టిచాకిరీ వచ్చింది; కాంట్రాక్టు పద్ధతి వచ్చింది. ఈ పద్ధతి మంచి లాభాలు తెచ్చిపెడుతుంది. వేలకొలది క్షుధార్తులైన కార్మికులు దక్షిణాఫ్రికా బంగారు గనులకు సప్లయి చేయబడుతున్నారు." తల్లులకూ, పిల్లలకూ సంబంధం లేకుండా చేస్తున్నారు. కుటుంబాలుకు కుటుంబాలు పనిభారం వల్లనైనా చస్తున్నారు లేదా విపరీతనిర్బంధవిధానంవల్లనైనా చస్తున్నారు. 80 వేలమంది ప్రజలకు ఒక్క డాక్టరు మాత్రమే వున్నాడు. మొజాంబిక్ జనాభాఅంతటికీ కలిపి 149మంది డాక్టర్లుమాత్రమే వున్నారు. నూటికి 99 మంది నిరక్షరాస్యులు.

ఇటీవలకాలంలో అమెరికా, బ్రిటిషు, బెల్జియం గుత్త వ్యాపారులు పోర్చుగల్ ఆర్థిక బలహీనతలను ఉపయోగించుకొని అంగోలా, మొజాంబిక్‌లలో కాలుపెట్టారు. మైనింగ్ పరిశ్రమలో ప్రవేశించారు. ఈ వలసలు ప్రధానంగా కాఫీ, పండిస్తాయి. అపారమైన ఖనిజసంపద వుంది.

స్పానిష్ సహారా : వైశాల్యం 1 లక్ష 5,400 చదరపు మైళ్ళు. జనాభా : 40 వేలు. తనకు చెందిన – సహారా ప్రాంతంనుండి స్పానియార్డులను వెదొలగించాలని మొరాకో ప్రయత్నిస్తోంది.

స్పానిష్ గినియా : వైశాల్యం 10 వేల 39 చదరపు మైళ్ళు. జనాభా : 1 లక్ష 34 వేలు.

పోర్చుగీస్ గినియా : వైశాల్యం 13,948 చదరపు మైళ్ళు. జనాభా : 5 లక్షల 20 వేలు.

దక్షిణాఫ్రికా సమాఖ్య : ప్రధాని : హెండ్రిక్ వెర్వోర్డ్; రాజధాని : కేప్ టౌన్; వైశాల్యం 4 లక్షలు 72 వేల 494 చదరపు మైళ్ళు. జనాభా 1 కోటి 30 లక్షలు.



ప్రధాని వెర్వోర్డ్

1960 అక్టోబర్ 5 వ తేదీన జనవాక్యసేకరణ జరిగింది. దక్షిణాఫ్రికా రిపబ్లిక్ గా రూపొందలా వద్దా అన్న విషయమై వెర్వోర్డ్ ఈ రిఫరెండం జరిపారు. కాని ఇది జనవాక్యసేకరణ అనడానికి వీలు లేదు. ఏమంటే మైనారిటీ వర్గాలైన తెల్లవాళ్లకు మినహా రిఫరెండంలో ఆఫ్రికన్లకు ఓటు హక్కు లేకుండా చేశారు.




అల్పసంఖ్యాకులైన తెల్లవాళ్ళు అసంఖ్యాక ప్రజలైన ఆఫ్రికన్లపై ఫాసిస్టు చర్యలకు దిగుతున్నారు. వర్ణవివక్ష, జాత్యాహంకారమూ, వెర్వోర్డ్ ప్రభుత్వ విధానాలు. వెనుకటి ప్రధాని మలాన్ మాలపల్లి చట్టం అడుగుజాడల్లో నడుస్తున్నవాడు వెర్వోర్డు. దక్షిణాఫ్రికా స్వతంత్రరిపబ్లిక్‌గా అవతరించడానికి గల కారణం - బ్రిటన్ అనుసరిస్తున్న యిప్పటి మితవాదధోరణి సహితం వెర్వోర్డుకు నచ్చలేదు.

ఈ సమాఖ్య ఏర్పడి యిప్పటికి 50 సంవత్సరాలు. స్థానిక యూరోపియన్ నివాసులచే పాలింపబడుతున్న స్వతంత్ర దేశం ఆఫ్రికాలో ఇదొక్కటే. దక్షిణాఫ్రికా బ్రిటిషు కామన్ వెల్తు సభ్యురాలు. ఇతర అధినివేశప్రాంతాలైన కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లు గాక దక్షిణాఫ్రికా శ్వేతప్రభుత్వం ఒకవిధంగా చిన్నతరహా సామ్రాజ్యవాద దేశమేనని చెప్పాలి.

దక్షిణాఫ్రికాలోని యూరపియన్లు "ఆఫ్రికన్లని", ఇంగ్లీషు మాట్లాడేవారని విభజించడం దక్షిణాఫ్రికా ప్రత్యేకత. వీరు 3 : 2 నిష్పత్తిలో వున్నారు. వీరు డచ్, బ్రిటన్ అనే రెండు ప్రధాన యూరపియన్ సంతతికి చెందినవారు. ఆఫ్రికన్లకు ఎక్కువ భూమి వుంది. ఆఫ్రికనర్లను బోయర్లు అని కూడా అంటారు. పరిశ్రమలూ, వాణిజ్యం ప్రధానంగా ఇంగ్లీషు మాట్లాడేవారి అధీనంలోనే వున్నాయి. గత సంవత్సరం దక్షిణాఫ్రికాలోని షార్పెవిల్లా నగరంలో ఆఫ్రికన్లపై ఘోర హత్యాకాండ జరిగింది ఆ ఘటన ప్రపంచాన్ని ఊపివేసింది. సభ్యప్రపంచం వెర్వోర్డ్ ప్రభుత్వ జాత్యహంకార విధానాన్ని నిరసించింది. ఐ. రా. స. ద్వారా సహితం దక్షిణాఫ్రికా ప్రభుత్వ చర్యల్ని అరికట్టించడానికి జరిగిన ప్రయత్నాలు విఫలమైనాయి చివరకు బ్రిటిష్ కామన్వెల్తు సమావేశం కూడా దక్షిణాఫ్రికా వేలు కదల్పలేకపోయింది. బ్రిటిష్ అండ వల్లనే ఇదీ జరిగింది. తరువాత ఘనా, మలయా దేశాధిపతుల చొరవవల్ల అనేక దేశాలు దక్షిణాఫ్రికాపై ఆర్థిక దిగ్బంధనం అమలు జరుపుతున్నాయి. మన దేశానికీ, దక్షిణాఫ్రికాకూ దౌత్యసంబంధాలు లేవు.

దేశంలో పాలకవర్గ పార్టీ నేషనలిస్టు పార్టీ. పార్ల మెంటులో ప్రధాన ప్రతిపక్షం యునైటెడ్ పార్టీ. దీనికి గతంలో స్మట్స్ నాయకత్వం వహించారు. ఈ పార్టీ బడా బడా పెట్టు బడిదారులపక్షం వహిస్తుంది.

దక్షిణాఫ్రికాను రిపబ్లిక్ గామార్చడం ప్రధాని వెర్వోర్డ్ ఆసక్తి చూపడానికి కారణాలున్నాయి: ప్రస్తుతం బ్రిటిష్‌వాళ్ళ పలుకుబడిలోవున్న ఉత్తర సరిహద్దు ప్రాంతాల్లోకి చొచ్చుకు పోవాలని వెర్వోర్డ్ ప్రభుత్వ యత్నం. బసోటోలాండ్, బెచునాలాండ్, స్వాజీనాలాండ్‌లను స్వాహా చేయాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి.

# మరికొన్ని వలసలు

జాంజిబార్ : బ్రిటిషు అధీనప్రాంతం. 19 వ శతాబ్దం ఆఖరిలో బ్రిటిషు సామ్రాజ్యవాదులు దీన్ని ఆక్రమించారు. వైశాల్యం: 19 లక్షల 17 వేల 750 చదరపు మైళ్ళు. జనాభా: 2 లక్షల 90 వేలు.

కేప్‌వర్డీ దీవులు : పోర్చుగీస్ వలస; 15 వ శతాబ్దం ద్వితీయార్థ భాగంలో దీనిని ఆక్రమించారు. వైశాల్యం 3,000 చదరపు మైళ్ళు. జనాభా : 1 లక్ష 80 వేలు.

మారిటియస్ : 1810 నుండీ బ్రిటిషువారి వలస. వైశాల్యం 1500 చదరపు మైళ్ళు. జనాభా: 5 లక్షల 69 వేలు.

రీయూనియన్ : ఫ్రెంచి సామ్రాజ్యవాదుల వలస. 1643 లో దీన్ని ఆక్రమించారు. వైశాల్యం 1875 చదరపు మైళ్ళు. జనాభా : 2 లక్షల 78 వేలు.

రువాండా - ఉరుండీ : వైశాల్యం : 40,650 చదరపు మైళ్ళు జనాభా : 46 లక్షల 36 వేలు. బెల్జియం పాలన క్రిందనున్న ఐ. రా. స ధర్మకర్తృత్వ ప్రాంతం. 19 శతాబ్దం ఆఖరిలో దీనిని జర్మనీ ఆక్రమించింది ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ఇది బెల్జియం మాండేటరీ ప్రాంతంగా మారింది.

సెయింట్ టోం, ప్రిన్సిపే దీవులు : పోర్చుగీస్ వలస. 1471 లో ఆక్రమణ. వైశాల్యం 723 చదరపు మైళ్ళు; జనాభా : 60 వేలు.

సెయింట్ హెలీనా : బ్రిటిషువారి వలస; 1659 లో ఆక్రమణ; వైశాల్యం 92 చదరపు మైళ్ళు; జనాభా : 5 వేలు.

సౌచిలస్ దీవులు : బ్రిటిష్ వలస, 1794 లో ఆక్రమించారు. వైశాల్యం 303 చదరపు మైళ్ళు. జనాభా : 40 వేలు.

నైఋతి ఆఫ్రికా : వైశాల్యం : 6,17,850 చదరపు మైళ్ళు. జనాభా : 50 లక్షల 39 వేలు. 1884 నుండి జర్మనీ వలసగా వుంది. తరువాత మాండేటరీ ప్రాంతంగా మారింది. దక్షిణాఫ్రికా సమాఖ్య దీనిని బలవంతాన ఆక్రమించుకున్నది. ఇప్పుడు ఈ వలసను ఐ. రా. స. ధర్మకర్తృత్వ పాలనకు అప్పగించడానికి దక్షిణాఫ్రికా ససేమిరా ఒప్పుకోనంటోంది.

